సాహిత్యప్రచారిణి. 3౫.

శ్రీ

# సురాభాండేశ్వరము



పూతలపట్టు శ్రీరాములురెడ్డి
కర్త.

మూల్యము 0–12–0

## అన్నపూర్ణ స్తుతి.

నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్య రత్నాకరీ
నిర్ధూతాఖిల ఘోరపావనకరీ ప్రత్యక్ష మాహేశ్వరీ
ప్రాలేయాచలవంశ పావనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ.

---

విక్టోరియాజూబ్లి ముద్రాక్షరశాల, చిత్తూరు.

1953

# మనవి.

---

ఈ సురాభాండేశ్వర చరిత్రము ఒకమిత్రబంధు నిర్బంధముపై వ్రాయఁబడినది. వారికి తొలుతనుండిన శ్రద్ధాభక్తులు తటాలున మటుమాయ మగుటచే వ్రాసినదాని మూలఁబడవేయ మనసురాక రెండేండ్ల మీఁదట నిది శ్రీ సురాభాండేశ్వరోపాసకులకేగాక ఇతరులనేకులకుఁ గూడ నుపయోగ పడఁగలదను నమ్మకమున నేతన్ముద్రణ మొనర్చితి.

ఈ గ్రంథమునకు మూలములు రెండుమూడు నొకటొకటఁద్రొక్కి యున్నందునఁ గథావస్తువునందు కొంతమార్పు గావించితి. మంచిచెడుగుల విమర్శింప విశాలప్రపంచము కలదు. శౌండికవృత్తి నిర్వహించి కృతకృత్యుఁ డైన ఇందలి కథానాయకుఁడును భారతమందలి ధర్మవ్యాధుఁడును తమ తమ కులవృత్తుల నిర్వహించు పట్ల నొక్కమార్గమునే యవలంబించియుండి రని పాఠకులు గ్రహించినచో నాయీ రచనోద్దేశము తెల్లముకాఁగలదు. ఇందలి గుణలేశమును పాఠకులకు సుకరముగా పరిచయవాక్యములతో తెలుకపఱచిన శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారికి కృతజ్ఞుఁడను. నాయీ మాఱ్పొందిన కథ నెవ్వరేని అనుసరించినను అనుకరించినను నామనస్తాపమునకు గుఱి యగుదురు.

చిత్తూరు
విజయవత్సర విజయదశమి }

ఇట్లు
విద్వద్విధేయుఁడు
**పూతలపట్టు శ్రీరాములురెడ్డి**
కర్త.

# ప రి చ య ము .



శ్రీవిద్వత్కవికులతిలక పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు రచించిన "సురాభాండేశ్వర" గ్రంథమును చదువు భాగ్యమేకాక దానికిఁ బీఠికవ్రాయు నదృష్టముకూడ నాకు లభించినందులకు నేను ధన్యుఁడను. ఈపేరున వెలసిన పురాతనాధునాతన రచనములఁ గొన్నిటిని నేనుం జూచియుంటిఁగాని వానియితివృత్తవైఖరి వేఱు; శ్రీరెడ్డిగారి రచనమునందలి యితివృత్తవైఖరి వేఱు. పూర్వరచనములందలి యభూతకల్పనములు, నప్రస్తుతవిషయములు, అనాచార ప్రకటనములు మున్నగునవి పెక్కులిచటఁ గానరావు. వ్యభిచారార్థమై వచ్చిన యొక దుష్టబ్రాహ్మణబ్రువుఁడు గృహస్వామి దర్శనభీతుఁడై యొక కల్లుకడవం జొరఁబాఱి ముఖనాసారంధ్రముల జొబ్బిలిన మద్యముచే నూపిరాడక యుక్కిరిబిక్కిరియై పాపఫలితమో యన్నట్లు దుర్మరణముపాలై పవిత్ర శివలింగముగా మాఱి పూజార్హుఁడయ్యెనని పూర్వులవ్రాఁత. అదియేనా పరస్త్రీగమనదోషమునకుఁ గలుగవలసిన ఫలితము?

శ్రీరాములురెడ్డిగారి రచన మట్లుకాక స్వకులాచారనిరతులై పవిత్రదాంపత్యము నెఱపు సుగుణమణి సుధాములకు కాశీవిశాలాక్షీ వరప్రసాదముచే జనించిన పూతచరిత్ర యన్నపూర్ణ శ్రీవిశ్వేశునే భర్తగాఁ బడసినట్లు వివరించు

చున్నది. మాయావటురూపధారియైన శివుని భర్తగా వరించి ధన్యురాలైన యీయన్నపూర్ణ పవిత్రురాలు. వరపురుషుని మాయమాటలకు లొంగి చరించిన యీయువిద నిస్సహాయు రాలు. సురాభాండ ప్రవిష్టుండైన యీబ్రహ్మచారి సాక్షాచ్ఛి వుండు. ఆబ్రాహ్మణబ్రువుండు సజాతీయుల యహంకృతిఫలిత ముగా నీశ్వరాకృతి ఈయంబడినవాండు. కావుననే శ్రీరెడ్డిగారి కృతి పవిత్రచరిత్ర చిత్రణముచే ధన్యమైనది.

ఈ సురాభాండేశ్వరమునందలి కొన్ని ఘట్టములు రచన మున కమూల్యాలంకారములు. సంతానహీనుల అతిసంతా నవంతులగుఱించి లోకులాడుమాటలు, వృథాన్యార్థభంగము సేయునీచులు పడుపాట్లు మున్నగునవి మిక్కిలి సహజములును హృదయంగమములునై యున్నవి. పరంపరాగతముగా వచ్చు సురాభాండేశ్వరగాథయందు శ్రీరాములురెడ్డిగారు తెచ్చిన మార్పులు కథాగౌరవము నధికము నేసి పవిత్రమొనరించు చున్నవి.

సురాభాండేశ్వరగాథ పెక్కుచోట్ల పెక్కువిధములుగాం జెప్పంకొనంబడుచున్నది. అందు నాయెఱింగిన కథయొం డుదహ రించెద. చిత్తూరుజిల్లా వాయల్పాడుతాలూకాలో కలకడగ్రామ మున వెలసిన యీశ్వరుండును సురాభాండేశ్వరుండే. కడప మండలమందలి సిద్ధవటమునేలు పుడమిఱేని తనయ సత్యవతి

యనునామె దైవమాయాకల్పితమైన గర్భముధరింప లోకాపవాదభీతిచే నామెతండ్రికూఁతు ఋజువర్తనము నిరూపించు వెరవొకటి ప్రకటించెనఁట. క్రూరవిషసర్పమును చుట్టగాఁజుట్టుకొని దానిపై నొకమధుభాండముంచి పాముకదలకుండునట్లు కల్లుకడవ తొణఁకకుండునట్లుగా నేఁడు పొలిమేరలుదాటి చనినజను లామెశీలము శంకింపరని యాజ్ఞాపించెనఁట. సత్యవతియు నట్టే యాభారమును వహించి పైనొడివిన కలకడ సమీపమునఁ గడవనుడించి తన యపనిందను దొలగించుకొనియు మనశ్శాంతి లేక జీవింపనొల్లక తండ్రి యెంతప్రార్థించినను వినక నదీరూపమునఁ బాఱిపోయెనట. ఆనదియే తత్ప్రాంతపు సత్యవతీనది. ఆసురాభాండమునుండి యంతదనుక నామెను గాపాడిన శివుఁడే లింగరూపియై యచట సాక్షాత్కరించెనఁట. 'కల్లుకడవ' యే 'కలకడ' యను వికృతినొంది నేఁడు నొకపుణ్యక్షేత్రముగా వెలసియున్నది. కాని పైకథలన్నిటికంటె కొన్నిమార్పులతోఁ గూడిన శ్రీరాములురెడ్డిగారిరచనమే యౌచిత్యమున కుదాహరణముగా వెలసియున్నది.

శ్రీ వేంకటేశ్వర కళాశాల
తిరుపతి.

ఇట్లు
సుధీవిధేయ
జీరెడ్డి చెన్నారెడ్డి

# విషయ సూచిక

శ్రీరస్తు.

# సురాభాండేశ్వరము.



నమః శివాయ శాంతాయ నిశ్చలాయ యశస్వినే
సనాతనాయ పూర్వాయ పురాణాయ సహోనమః

నిర్వికార చిదానంద నిత్యరూప మహేశ్వర
నిర్మలాంగ నిరాలంబ సురాభాండేశ తే నమః.

—: సుధాముని కుటుంబము :—

శ్రీకరంబగు భరత భూమియందు పవిత్ర గంగాప్లావిత సస్య శ్యామల పరిసర ధారణీ వలయితంబు విశాలాక్షీ విశ్వనాథ పరిపాలితంబు అన్నపూర్ణా సుభిక్షితంబు సకల కలాకోవిద నిలయంబు కలార్థిబృంద కోలాహల బహుళంబు అసంఖ్యాక పుణ్యతీర్థ పరివృతంబు సర్వదేవతా నివాసంబు వారణాసీపురంబు. అందు సుధాముఁడను శౌండిక కుల మండనుండు కలండు. అతఁడు సదా శ్రీమదుమామహేశ్వర చరణ కమల సమర్పిత హృదయ పంకజుండు. శ్రీవేంకటేశ్వర నిత్యపూజా విశిష్టుండు. సదా సంతుష్టుండు. భక్త సేవా

తత్పరుండు. విద్వజ్జన విధేయుండు. విద్యార్థి జన కల్పక కల్పుండు. సుగుణ నిలయుండు. దుర్గుణ దూరుండు. అతనికి సుగుణమణి యను గృహిణి నిక్కంపు సుగుణమణి. సుగుణ గణఖని. అనుకూలవతి శీలవతి కుశలిని కులీన పవిత్రచరిత్ర ప్రియభాషిణి యై సార్థక సహధర్మచారిణి యై యుండెను.

సంచారో రతిమందిరావధి సఖీ కర్ణావధి వ్యాహృతం
చేతః కాంత సమీహితావధి మహోమానోపి హానావధిః
హాస్యం చాధర పల్లవావధి పద న్యాసావధి ప్రేక్షితం
సర్వం సావధి నావధిః కులభువాం ప్రేమ్ణః పరం కేవలం.

సంచారము పడకటింటివఱకే. మాటలు చెలి చెవుల వఱకే. మనస్సు పతికోరికవఱకే. నవ్వు పెదవివఱకే. గౌరవము మానము వఱకే. చూపులు నడచుచున్న అడుగులవఱకే. కులస్త్రీలకు అన్ని కార్యములందును హద్దు కలదు గాని ప్రేమయందు మాత్రము లేదు.

అను పెద్దల వచనభంగి ననుసరించి భర్తృ శుశ్రూష పరమావధిగా నెంచి యతని కార్యములం దామె తోడ్పడు చుండునది. పతికి మజ్జన భోజనాదిక్రియలు తానుగఁజేయుంగాని పరిచారిక లెందఱున్నను వారిచేఁ జేయింపదు. భర్త పొరుగూరి కేగినతఱి చందన పుష్పాద్యలంకరణంబులు కావింపదు. పరిచారికాజనంబుపై మాతృ వాత్సల్యంబు చూపు. కటు

ాక్కు లోకనాఁడేని యామె నోటినుండి వెడలునవి కావు. ంతిహితుల మేలి గౌరవముతో నాదరించు. నిత్యంబు భృత్య ునంబుల కృత్యాకృత్యంబు లెఱింగి మఱునాఁటి కృత్యంబులు ౦ధించు. ఇది యది యననేల? గృహకార్యంబులం దెంతయు ములఁకువ గలిగి ప్రవర్తించుచు భర్తృకార్యంబులం దోడు పడుచుఁ దద్భార విమోచనంబు గావించుచుండు. వేకువను ఎద్రింపదు. పెద్దలకంటె మున్నుగ భుజింపదు. రిక్తవ్యయంబు సేంకదు. గురుకులవాసంబుచేసి విద్యనార్జించు బాలకుల నత్యంత ప్రీతిమెయి నాదరించి వలయు సాయంబులు సేయు. స్వపక్ష పతిపక్షంబులను భేదభావంబు మాని యెల్లబంధుల సమాన గౌరవంబున నాదరించు.

అట్టి నారీరత్నంబు తన కిల్లాలైనందుల కా గృహమేధి సుధాముఁడు పరమేశ్వరునకుఁ బలుమఱు లోలోన మ్రొక్కు లిడుచుండు. ఉత్తమసతీ సంసర్గముచే నతని కెన్నియేని లాభంబు లొడఁగూడుచుండుటచే దినదిన ప్రవర్ధమాన ప్రేమచే నతండు కులసతి కోరికల నెన్నండును త్రోసివైచువాఁడు కాఁడు. అట్టి యవకాశ మతనికి లభింపనే లేదు.

సుధామునకుఁ బిత్రార్జితంబగు క్షేత్రంబులు వనంబులు వలసినంతకంటె నెక్కుడుగఁ గలవు. సురాద్రుమములు వలసిన తఱి వలసినంత వంగి సురద్రుపులవలె వలసినంత మధు వొసంగు

చుండు. నిత్యము రెండువందలమంది భృత్యులు తాళవనమం
దును వనఖర్జూరవనమందును అభినవ యంత్రశాలలందును
పనిచేయుచుందురు. పది మధువారము లందందు గలవు.
అందు మదిరా గంధోత్తమా మాధవమార్ద్వీక మైరేయాసవ
శీధు సురా మండాది వివిధ పానీయమ్ములుండు. రాజులు
రాజబంధువులు సంపన్న గృహస్థులు తమ తమ గృహంబులకే
వివిధ మద్యంబులఁ దెప్పించుకొందురు. † సామాన్య జనం
బా పానశాలలఁ జేరి వెలయువానిని కాచ చషకంబులఁ గొని
సేవించి పోవుచుందురు. వైద్యులు వలయు నౌషధంబుల
మేళవింప వలసినంత కొంపోవుచుందురు. ఇంత యుండియు
సుధాముఁ డొకనాఁడేని దురభ్యాసములకు లోఁగినవాఁడు
కాఁడు. అట్టివారితో స్నేహముచేసి యెఱుఁగఁడు. వారిని
దరిఁజేరనీయఁడు. ఎట్టి కార్యమైనను తన యర్ధాంగితో
నాలోచింపక చేయువాఁడు కాఁడు. ఆయ వ్యయంబు లతని
కళత్రంబ ప్రతిదినము పర్యవేక్షించుచుంటచే నతఁడు కార్య
నిర్వాహణమందును పరస్థలముల కనుపు మద్యాదుల విచారణ
మందును కనుగలిగియుండు. 'స్వధర్మే నిధనం శ్రేయః' అను
గీతావాక్యము ననుసరించి తనకులధర్మము వదలక యాచ
రించుచు రాబడియందైదవపాలు విద్యార్థుల వసతులకు నన్న

† ఆ కాలంబున నవి మితిపద్ధతితో నుండెఁ గావున సేవనీయమై యుండెఁగాని నిషేధనీయమై యుండలేదు.

దానశాలలకు నీతిబోధకులకు వినియోగించుచుండు. ఆకుల నుండి పుష్పములనుండి పట్టలనుండి ఫలములనుండి పలువిధము లగు నాసవములు యంత్రముల మూలమున నుత్పత్తిగావించి పరదేశములకును పంపుచుండువాఁడు. తన్మూలమున నతని కెటుకయు మైత్రియులేని రాజులు లేరు. వ్యాపారులు లేరు. ధనికులు లేరు. దాన గ్రహీతలు లేరు. అన్నదానశాలా నిర్వాహకులులేరు. సర్వకలాశాలా సంస్థాపకులు లేరు. ధర్మ కార్య నిర్వాహకులు లేరు. సాయము నొందని బీదలు వివాహితులు విద్వాంసులు కానరారు. ఇట్టి యుదారమతియై నందున సుధాముఁడు సమస్త రాజలోకమున కాప్తమిత్రుండై ప్రకాశించె. దివాంధములఁబోలు లోభులకు సుధాముని సంపద్వృద్ధితోడ నసూయయు వృద్ధియై కన్నుగుట్టెఁగాని వారి లోలోని దుష్కృత్యములు చౌటం జల్లిన విత్తులంబలె నప్పటి కప్పుడే వ్యర్థము లగుచుండె. మొలచిన యొండు రెండు మొలకలు పాలిన మొగములు వైచికొని యచిరకాలమునఁ బేరు మాయుచుండె.

—: సంతాన చింత :—

సంతానములేని చింత యొండు మాత్ర మాపుణ్యా దంపతుల నప్పుడప్పుడు కలంతపఱచుచుండెడిది. లోకమున ధనవంతులు సంతానహీనులై యలందురుచుంటయు బీదలు

బహుపుత్రకులై యలజడినందుచుంటయు మనము కాంచుచునే యున్నారము. విచారించితిమేని సంతాన హీనతకు గారణము పలువురు పలు విధముల వాక్రుత్తురు. వైద్యులు దంపతుల యారోగ్యము చెడినదనియు సతిగర్భాశయము చక్కని స్థితినుండ లేదనియు వాకొందురు. జ్యౌతిషికులు గ్రహగతులు బాగుగ లేవనియు నవగ్రహస్థాపనము చేయింపుఁడనియు మంత్రవాదులు దుష్టగ్రహము సోఁకెననియు కర్మవాదులు పూర్వజన్మమునందు పొరుగింటి పిల్లవాని హింసించిన దోసమనియు నిట్లేమఱి పలువురు పలువిధములఁ బలుకుచుందురు. అందేది సత్యమో యెవరి కెఱుక? పైయవియన్నియు నసత్యములని బూటకములని స్థిరీకరింపను గాదు. ఏలయన నొక్కొక్కటి యొక్క కొందఱి కనుభవసిద్ధాంతమై యుండును. కొందఱకు సత్యమైనది మఱి కొందఱి యనుభవమున నసత్యమగుటెట్లని కొందఱు ప్రశ్నింతురు. పెద్దల వాక్యానుసారము తీర్థయాత్రలుచేసి యశ్వత్థ ప్రదక్షిణము లాచరించి నాగప్రతిష్ఠలు కావించి నింబాశ్వత్థ వివాహము లొనరించి తలఁచిన నోములునోచి మందులపై మందులు సేవించి పాడుగుళ్ల బాగుపఱచి పేదలకు పెండ్లిండ్లు చేసి యన్నసత్రంబులు గట్టించి యెడారులఁ జలి పందిళ్లు పెట్టించి మఱి యెంద ఱెన్ని చెప్పిన నన్నింటి నాచరించి విఫలులై విషాదమందు వారెందఱు లేరు! పాపపు దైవమునకుఁ గన్నులులేవు. వలచి సేవించువారికీయక వలదని

మొఱ పెట్టుచున్న మా మొఱఁగట్టుచుండె నని నిందించు వారెందఱు లేరు! సంతులేని వారి చింత యపార పారావార మగుచుండ నతిసంతానముగలవారి చింత సప్త సముద్ర పరిమితిని మించుచుండు. అన్నింటికి దైవమును నిందించుట కొందఱ కలవాటు. దేవుఁ డూరూర నింటనింటఁ బ్రతి మను జునికి మానినికిఁ జక్కట్టులు దిద్దుచున్నాఁడా? వారివారి కర్మానుసారము జరుగునని కొందఱు సమర్థించుచుందురు. కొందఱు తమకుఁ దెలిసి యేదోస మాచరింపకున్నను కష్ట ములపైఁ గష్టములు వచ్చిపడుచుండలేదా? ఇది యేకర్మ ఫలమని ప్రశ్నింపఁ బూర్వజన్మకర్మఫలమని కర్మవాదులు పలుకుదురు. దోసము లెఱిఁగించి తగిన దండనము విధించుట ధర్మపద్ధతి యగుఁగాని దోసమే తెలియనీయక చేయు దండనము శిక్షయెట్లగు? దానిచేఁ గలుగు పరిణామమేది? శిక్షయనఁ జక్కఁదిద్దుట కాదా? అట్టి దిద్దుపాటు బొత్తిగా లేని దండనము ధర్మసహిత మగునా? ధర్మ రహితమగునా? అని యొక కొందఱు వాదింతురు. దేవుని యుద్దేశమెద్దియో మనమెఱుఁగ నెంతవారము? సర్వజ్ఞుఁడగు జగన్నియంత కార్య ములందు దోషారోపణము గావించుట యల్పజ్ఞులగు మాన వులకు సమంజసము కాదని వేఱొక కొంద ఱొక బ్రహ్మ స్త్రము వైచి వాగ్బంధము గావింపఁ జూతురు. మఱి యతఁడు వాదింపఁబూనిన నాస్తికుఁడని నిందింతురు. ఇట్లు ప్రతి

విషయమందును తలకొక మతముగాఁ దలఁతోఁకయేర్పడని పరిస్థితి గలుగుచున్నది. కావుననే 'మార్గమేది?' యని యడిగిన ధర్మదేవత ప్రశ్నమునకు ధర్మజుఁడిట్లుత్తర మిచ్చె.

తర్కోఽప్రతిష్ఠః శ్రుతయో విభిన్నాః
నైకో మునిర్యస్యమతం ప్రమాణం
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతః సపంథాః.

ఊహాస్థిరపడుటలేదు. వేదశాస్త్రములు భిన్నాభిప్రాయములు కలవి. ప్రామాణికుఁడైన మునియొక్కఁడును కానరాఁడు. ధర్మతత్త్వము గుహాలో పూడ్వఁబడి నట్లున్నది. కాన పెద్దలు నడచినదే త్రోవ.

బిడ్డలులేని కొఱఁత మఱపునకు వచ్చునట్లామానినీ తిలక మిరుగుపొరుగు బంధుబాలికలను బాలకులను ప్రేమతో నెత్తుకొని లాలించుచు ముద్దాడుచు తినుబండము లిచ్చుచు నాటవస్తువులు కొని తెప్పించి యిచ్చుచు నిట్లెంతప్రియము చూపినను కొందఱు శిశువులు కన్నతల్లి మోముగాంచినంతఁ దనయొద్ద నిలువక పరుగువాఱుటగాంచి యాపతివ్రతారత్నంబు లోలోనఁ దనకొక ప్రేలేఁడు బిడ్డయున్నచో నిట్లుసేయునా యని చింతించు.

గృహే జానుచరః కేల్యాం ముగ్ధస్మిత ముఖాంబుజః
పుత్రః పుణ్యవతామేవ పాత్రీభవతి నేత్రయోః

ఇంటియందు దోఁగాడుచు అమాయికమైన చిఱునవ్వుతోఁ గూడిన ముఖపద్మము కల పుత్రుఁడు పుణ్యావంతులకు మాత్రమే కనుల పండువు కావించును.

స్వగర్భ శుక్తి నిర్భిన్నం సువృత్తం సుతమౌక్తికం
వంశశ్రీ తిలకీభూతం మందభాగ్యస్య దుర్లభం.

తన గర్భమనెడి శుక్తినుండి పుట్టినదియు మంచి వృత్తము (గుండ్రదన, నడవడి) కలదియు వంశలక్ష్మికి (వెదురునకు, కులమునకు) తిలకము వంటిదియు నగు పుత్రుఁడనెడి ముత్తెము మందభాగ్యులకు లభింపదు.

అంతఃకరణ తత్త్వస్య దంపత్యోః స్నేహసంశ్రయాత్
ఆనందగ్రంథి రేకోయ మపత్యమితి బధ్యతే.

దంపతులకు అంతఃకరణతత్త్వమైన స్నేహసంశ్రయము వలన బిడ్డ ఆనందమనెడి బంధమగుచున్నది.

దిగ్వాససం గతవ్రీడం జటిలం ధూళిధూసరం
పుణ్యాధికాహి పశ్యంతి గంగాధర మివాత్మజం.

దిగంబరుఁడై సిగ్గెఱుఁగక ధూళినిండిన జడతోఁ దిరుగు బాలకుని సాక్షాత్పరమశివునిగాంచినట్లు పుణ్యవంతులైన దంపతులే కాంచుచుందురు.

ఉరోరుహాదుద్గమితైః పయోభి
రాపూర్య కేళ్యా నిజ మాస్యగర్భం
ఫూత్కృత్య మాతు ర్వదనే హసంతం
తనూభవం పశ్యతి కోఽపి ధన్యః.

స్తనమునుండి పైకుబికిన పాలను వేడుకతో నోటినిండుగఁ బెట్టుకొని తల్లిమొగమున ఫుఱ్ఱుమను శబ్దము గలుగ నుమ్మి కేకవెట్టి నవ్వునట్టి కుమారుని కాంచునట్టివారే ధన్యులు.

ఆలక్ష్యదంత ముకుళా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణ రమణీయ వచః ప్రవృత్తీ
నంకాశ్రయ ప్రణయిన స్తనయాన్ వహంతో
ధన్యా స్తదంగరజసా మలినీభవంతి.

మొగ్గలవంటి పండ్లు కొంచెముగాఁ గనఁబడ, కారణము లేని చిఱునవ్వుతో, అస్పష్టమైన యక్షరములతో మనోహరముగా మాటలల్లుచు తొడమీఁది కెక్కునట్టి ప్రేమస్వరూపులైన బిడ్డల యొడలిధూళిచే ధన్యాత్ములైన తలిదండ్రులే ముఱికి కలవారగుచున్నారు.

పాత్రం నతాపయతి నైవ మలం ప్రసూతే
స్నేహం నసంహరతి నైవ గుణాన్ క్షిణోతి
ద్రవ్యావసాన సమయే చలతాం నధత్తే
సుపుత్ర ఏవ కులసద్మని కోఽపి దీపః

పాత్రమును (ప్రమిదను, యోగ్యతను) కాల్చుటలేదు. మసికిని (పొగను, అపకీర్తిని) వెలివఱుచుటలేదు. స్నేహమును (చమురును ప్రేమను) నాశముచేయుటలేదు. గుణమును (వత్తిని, గుణగౌరవమును) క్షీణింపఁజేయుటలేదు. ద్రవ్యము క్షీణించినపుడు చంచలత్వమును పొందుటలేదు. కావున కులమనెడి గృహమునకు సుపుత్త్రుఁడే మంచిదీపము.

అను విద్వత్కవుల వాక్యములం దలంచి కుమారిలు చుండు. విద్యావతి కావున నొక్కొక్కపరి

> కింతేన జాతు జాతేన మాతుర్యౌవన హారిణా
> ఆరోహతి నయస్స్వస్య వంశస్యాగ్రే ధ్వజోయథా.

వంశమునకు (వెదురునకు, కులమునకు) ధ్వజమువలె నున్నతస్థానము నధిష్ఠింపఁడేని అట్టిపుత్త్రుఁడు పుట్టిన మాత్రాన ఏమి ప్రయోజనము? తల్లిదేహపుష్టిని హరించువాఁ డగుచున్నాఁడు. అంతే.

> కింతయా క్రియతే ధేన్వా యాన నదోగ్ధ్రీ నగర్భిణీ
> కోఽర్థః పుత్త్రేణ జాతేన యో నవిద్వాన్ నధార్మికః.

గోవు గర్భిణియుఁగాక పాలిచ్చునదియుఁగాక గొడ్డుటావైనచోఁ గొని యేమి వినియోగము? అట్లే పుత్త్రుఁడు

పుట్టియు విద్వాంసుఁడుగాక ధార్మికుఁడుగాక యున్నచో నేమి ప్రయోజనము?

కోటరాంతఃస్థితో వహ్ని స్తరుమేకం దహేత్ఖలు
కుపుత్రస్తు కులేజాతః స్వకులం నాశయత్యహో.

తొఱ్ఱలో నేర్పడిన యగ్ని యాచెట్టు నొకదానిని కాల్చుచున్నది. దుష్టుఁడగు కుమారుఁడు తన పుట్టిన కులమునంతటిని నాశము చేయుచున్నాఁడుకదా!

అనియుఁ జింతించుచుండు. తల్లి యనిపించుకొనని తరుణి జన్మము వ్యర్థము. ఆమెను గొడ్రాలని లోకులు హేళనము చేయుదురు. శుభకార్యములందు పుత్రవతులకే గౌరవమెక్కువ. తొలిమర్యాద. అని తీఱనిచింత మునింగి యొకనాఁడు కూర్చుండియున్న సుగుణమణింగాంచి తద్భర్త యామెకు వేఱుచింత లెవ్వియు లేమియు సంతానచింత యొండే సర్వావస్థలయందు సంతపింపఁజేయుచుండుటయు నెఱిఁగినవాఁడు గావున నయ్యామం జేరంజేరి లాలన వాక్యముల నిట్లనియె.

—: సుధాముని సమాధానము :—

సుగుణమణీ! నీవు నిక్కంపు సుగుణమణివని నేనెంతయు లోలోన గర్వించుచుంటి. నీకు సంతానచింత మిక్కిలిగ

నలముకొన్నది. అందులకు వలయు నోములు నోచితివి. తీర్థములు సేవించితివి. తలంచిన దేవతలం గొలిచితివి. ఆరోగ్యమందు దొసంగు గలదని యౌషధములు సేవించితివి. కానరాని వేలుపులకు మీందులెత్తి కట్టితివి. చేయందగిన కార్యములం జేయుచునేయున్నదానవు. బిడ్డలు గలవారి యిడుములం గాంచియైన విరక్తి నొందకుంటివి. ధృతరాష్ట్రునకు నూఱుగురు కుమారులుండి తలిదండ్రుల నెంతమాత్ర ముద్ధరించిరి? భీష్ముండు శుకుండు హనూమంతుండు మున్నగువారు బిడ్డలులేక చెడిరా? చిత్తము స్వాయత్తము చేసికొనవలయుంగాక పుత్రుల వలనం దాముద్ధరింపంబడుదు మనుమాట వెట్టిమొట్టిమాట. ఏల మీరు సంధ్యావందనము చేయకున్నారు? అది సదాచార లోపముకదా? యని యడిగిన వారి కొక మహామహుం డేమని యుత్తరమిచ్చె నెఱుంగుదువా?

మృతా మోహమయీ మాతా జాతో బోధమయః సుతః
సూతకద్వయ సంప్రాప్తౌ కథం సంధ్యా ముపాస్మహే.

మోహమనెడి తల్లి గతించెను. బోధమయుండైన (విజ్ఞాన మనెడి) పుత్రుం డుదయించెను. ఇరుతెఱంగుల సూతకము (జాతాశౌచము, మృతాశౌచము) కలుగంగా నెట్లు సంధ్య నుపాసింతునని వచించిన మహానుభావుని వాక్యము లర్థము చేసికొనుము. మోహచ్ఛేదకమైన విజ్ఞానమే పుత్రుండు.

అట్టిపుత్రుఁడే నిన్నుద్ధరించువాఁడు. 'శబ్దేందుశేఖరః పుత్రో మంజూషా మమకన్యకా' యని నాగోజీభట్టు తన కావ్యములే నిత్యసంతానమనియె.

> సంధ్యావందన భద్రమస్తు భవతే భోస్స్నాన తుభ్యంనమః
> భోదేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహంక్షమః క్షమ్యతాం
> యత్ర క్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
> స్మారం స్మార మఘం హరామి తదలం మన్యే కిమన్యేన మే.

ఓ సంధ్యావందనమా! నీకు శుభమగుఁగాక. (పోయి రమ్ము) ఓ స్నానమా! నీకొక నమస్కారము. (నీవును దూరముగాఁబొమ్ము) ఓ పితృదేవతలారా! మీకు తర్పణ విధులు చేయఁజాలను. క్షమింపుఁడు. ఎచ్చటనైన నిశ్చింత ముగాఁ గూరుచుండి హింసారూపుఁడగు కంసుని సంహరించిన శ్రీ కృష్ణదేవుని సదాస్మరించుచు నాపాపములను పోఁగొట్టు కొనుచున్నాను. ఆ శ్రీకృష్ణస్మరణమే పాప నివృత్తికిఁ జాలునని తలంచుచున్నాను. తక్కినవానిచే నేమి ప్రయోజనము? అని వాక్రుచ్చిన లీలాశుకుని వాక్యము స్మరించుచుండుము చిత్త శాంతి నొందుము. చింత చిత అనురెంటఁ జింతయే గొప్పది. చిత నిర్జీవమగు శవమునే దహించుచున్నది. చింతయన్ననో సజీవమైన ప్రాణిని చంపక చావనీయక యావజ్జీవము దహించుచున్నది. కావున చింతనూనకుము. చింతారోగమును

నిర్మూలింప సర్వేశ్వర ధ్యానమే దివ్యౌషధము. అని సుధాముఁడు వచించి యిల్లాలి నోదార్చి కార్యభారమూని గృహము వదలెను. సుగుణమణియు విచారపరురాలు కావున సంతాన నామక చింతాసాగరమును దైవ చింతనమను తెప్పచే దాఁటెను.

ఇట్లు కొంతకాలము సుఖలీల గృహకృత్యములు నిర్వర్తించుచుండ నొకనాఁటి రేయి నాలవజామునఁ దనయిష్ట దైవమగు విశాలాక్షి తన యుత్సంగమునఁ గూరుచున్నయట్లా గృహిణి కలగనె. తత్ఫలముగ నామెకు నెలదాఁటెను. అంతకే యాపె యానందమునకు మేర లేకపోయెను. నిర్భరానంద పారవశ్యముచేఁ దద్వృత్తాంత మాపె భర్తకుఁ దెలిపె. అతండును లోలోన నానందించి యెట్టి చింతలులేక యీశ్వర ధ్యాన నిమగ్నవై యుండుము. విశాలాక్షికి నిత్యసేవ సేయుము. అలఁత నొందకుము. ఆసపుట్టుఁ గాని అమితముగాఁ దినకుము. అనందమనస్కవై బీదసాదల నాదరింపుము. దాస దాసీ జనంబులఁ గసరకుము. నీ కెందును కొఱఁత లేదు కావునఁ గోపాసూయాదుల కెడమీయక సదా సంతుష్టవై యుండుము. అను నిత్యాది వచనంబుల నాయమకు సంప్రీతి గావించి యతఁడు కార్యభార నిమగ్నుఁడై పొలములఁ జూడనేగె.

ఆమేటి యిల్లాలును దినదిన మంగళ కార్యాచరణ భారయై చింతాసూయాదుల మనంబునఁ జేరనీయక యయిదువల

కభీష్టంబు లొసఁగుటయందు బీదల నాదరించుటయందు బంధుజనంబుల గౌరవించుటయందు అతిథుల నరసి యిడుట యందు తక్కుంగలవేళల గృహకృత్య విచారణమందు ననుక్షణము దైవనామచింతనమందు కాలంబు పుచ్చుచు గర్భాభివృద్ధికనువగు నాహారనియమాది దోహదక్రియల నాద రించుచు దినంబులు కడపుచుండె. దినంబులు నెలలు క్రమముగఁ గడచుకొలఁది నాయమ గర్భభారాలసయయ్యెను తదీయ గేహమున కేతెంచి తన్నుపరామర్శించు బంధువనితలను పౌరకాంతామతల్లుల నిరుగుపొరుగు వృద్ధాంగనలఁ దానే బహువిధముల సంభావించుచుండెడిది. వలదన్న నూరకుండఁ జాలదు. ఊరక సోమరియై కూర్చున్న ననేకాపదల కాలయం బగుదుమని యయ్యామ చక్కగ నెఱుంగు. ఇట్లామానినీ తిలకమునకు తొమ్మిదినెలలు తొమ్మిది దినంబులవలెఁ గడ చనియె. ఆసన్న ప్రసూతయై నడవఁజాలక మెల్లన నడుగిడు నిల్లాలింగాంచిన యమ్మేటిగృహస్థు సుధాముఁడమితానంద మందుచు గంభీరహృదయుండు కావున బయలుబ్బనీక యడఁచుకొనుచుండె.

—: పుత్రికా జననము :—

వేదవిదులు ప్రతిదిన మరుదెంచి శుభాక్షత లొసఁగి యాశీర్వదించి పోవుచుండిరి. జ్యోతిష్కులు పిలువకున్న నరుదెంచి

పుత్రఇత్యేవ పితరి కన్యకేత్యేవ మాతరి
గర్భప్రశ్నేషు కథవాఙ్ దైవజ్ఞో విజయీభవేత్.

అను వాక్యానుసారముగా స్తుతివాక్యములాడుచు మీయింట లక్ష్మి జనింపనున్నదని యాయమకును చక్రవర్తి లక్షణ లక్షితుఁడైౖ కుమారునివంటి కుమారుఁడు గలుగునని యతనికి నింపారువాక్యములఁ దెలుపుచు నభీష్టము లంది పోవుచుండువారు. గడియ గడియకుఁ బురోహితుఁడు వచ్చి శుభముహూర్తవార్తలాడుచు ఎండలోనిలిచి నీడను గొలుచుచు గడియలు లెక్కించుచు స్వగృహమున కేగుట మానె. సమీప బంధువనితలు నిక్కింపుఁ జెలులు ప్రేమపూర్ణలగు దాసీజనంబులు సుగుణమణిని పరివేష్టించి శుభవార్తలాడుచు ఱెప్ప వేయక రేయింబవల్లు కాచియుండిరి.

ఇట్లుండ నొక శుభదినంబున నుషఃకాలంబున గ్రహగతులు లోకోత్తరచరిత్రంబు నావిష్కరించు మంగళకరలగ్నంబున నాయుత్తమగృహిణి సుగుణమణి ముద్దులు మూటగట్టు నాఁడుబిడ్డను నీల్లాడె. ఎల్లవారలు సుఖప్రసవమని యానందించిరి. ఆరోగ్యవతులకు ప్రసవశ్రమ మధికముగా నుండదని యనుభవశాలినులైన వృద్ధాంగన లనిరి. ఇంతకాలము లేక లేక కలిగిన దాఁడుబిడ్డయా? యని కొంద ఱమ్మలక్కలాడిరి. ఏదో యొకటి! దేవుఁడిచ్చినది! అని మఱికొందఱు మగువలు

సమాధానమొసఁగిరి. వృద్ధబాంధవ చిరంటికల యాదేశానుసారము సావికలు పురుటింటి పనులు దిద్దిరి. శిశువును జలకమార్చి తడియొత్తి పొత్తులనునిచి తల్లిప్రక్కఁ బరుండఁబెట్టిరి. ఆత్మగర్భ జనితయగు నిసుఁగుం గాంచిన క్షణముననే సుగుణమణి తన మునుపటి శ్రమమంతయు మఱచి ప్రాణపతి తనకూఁతుంగాంచి యానందించు టెప్పుడని తలంచెను. ఔను. అదియుక్తమే. సతీమతల్లుల సర్వశ్రమములు పతులయానంద ముకొఱకే కదా!

తదనంతరము చేటిక లాశిశువును పుష్పాలంకృతంబై ముత్తెంపు జాలరులచేఁ గాంతులు జాలువాఱు జాళువా పసిండి యుయ్యేల యందుంచి లాలి జోల పాడి నిద్రపుచ్చిరి. వచ్చిన బంధుమిత్రజనంబుల కవ్వారిగఁ జందన పుష్పతాంబూలాది కములతోడ సువర్ణతారహారములు చెఱి యొకటిగ నొసఁగిరి. వచ్చిన యెల్లవారు సంతృప్తులైరి. పదిదినంబులు జాతకర్మంబు శాస్త్రయుక్తంబుగఁ గావింపంబడియె. ఉషఃకాలంబునఁ బుట్టినది కావున నీబాలికారత్న ముష యనుపేర నొప్పారునని కొంద ఱనిరి. శిశువునం దతిమానుష లక్షణంబులు కొన్ని యున్నకతమ్మునను శ్రీవిశాలాక్షీ కరుణాకటాక్షవీక్షణ ప్రభావముచేఁ గలిగిన కారణమ్మునను విశాలాక్షి యను నామధేయంబు తగియుండునని కొందఱు పెద్దవారనిరి. ఏపేరు పెట్టుదము తల్లీ! యని చెలులు కొందఱు కన్నతల్లి నడిగిరి.

ఆయుమ యించుకలజ్జామిశ్రితమైన మందహాసంబుతో నీ యిష్టము పెద్దలయాజ్ఞ పతియనుమతము అని తలవంచెను. తుదకు విశాలాక్షియని పెద్దలు స్థిరీకరించిరి. మేము ఉషాదేవి యనియే పిలుతుమని కొందఱు మందయానలు హాళవాదము చేసిరి. వారివారి యిష్టము వారిది అని కొందఱు చందనగంధు లు మధ్యస్థ వాక్యములాడిరి. ఇంతయు వినుచున్నతల్లి యా నందము నేమని వర్ణింపఁగలము? పూర్తిగ నున్నదున్నట్లు తెలుపఁదగు మాటలు మాయూహ కందలేదు. కావున మా లేఖినియు నిట నిస్తబ్ధమైనది.

—: బాలికా లీల :—

శిశువుల యమాయిక హాసము తల్లిదండ్రులకే కాక యెల్లవారలకు నానందజనకము. అది ప్రాపంచికపు టంటుసొం టు లేని నవ్వు. కావున తదానందము మాటలతోఁ దెలుప నలవికానిది. బిడ్డలు దేవుని ప్రతిబింబము లనుట యెంతయు సత్య ము. వారల యవిదిత రోదనము కూడ నానందదాయకమే. ఏడువని బిడ్డ యారోగ్యముతో నుండలేదని కొందఱు బిడ్డ తల్లు లందురు. ఉంగుంగయని వారు పలుకుచుండఁ గోకిలల కూఁతలకు బాలకులవలె మాఱుపలుకు తల్లుల యానందము మునకు మితిగలదా? తనశిశువు చేయు చేష్టలను చెలులకు నిరుగు పొరుగు లమ్మలక్కలకుఁ దెలుపునప్పటి జననీ

మోదంబునకు మేర తెలుప శక్యమా? తనచంకనుండి తండ్రి చేతులఁ బడవలయునని చేతులు చాఁచఁగా ఇదిగో! మీ కుమారిని మీరెత్తుకొనవలయునఁట! పదినెలలుమోసిన మేము పనికిరామఁట! అని తేరమాటల మేలములాడుచు భర్త కరంబులఁ బెట్టునప్పటి యామోద మింతింత యన వశమా? బోరగిలఁబడు నప్పుడొక క్రొత్తసంతసము. దోఁగాడఁ బూనునపు డొకవింత యానందము. తల్లి వీఁపు నానుకొని నిలువఁ బడినపుడును తల్లివ్రేళ్లుపట్టుకొని తప్పటడుగు లిడునపుడును కుంకిబండివలె నీవలావల కొఱగుచు నడచునపుడును గలుగు ప్రేమానందంబులు కొలఁది యిడరానివి. నాలుక యించించుక స్వాధీనమగుచో అత్తత్త యనగా అమ్మమ్మ యనక అత్తత్త యనియెఁగదా యని పొందు పరమానంద మంతు లేనిది. ఏలయన అమ్మమ్మయన నమ్మకు అవ్వకు నల్పాయువఁట! అత్తత్తయన నత్తమడిసినఁ గోడలికి సుఖసంసారమగునఁట! కాన ఆనందదాయకమని కొందఱ యాశయము. ఎవ్వరి పేరు మొదట నుడివిన వారు మరణింతు రనుమాట విశ్వసనీయముకాదు. ఎట్లన, కవుడు కుసీదము లేని శిశువుల మానసములు మనవలెఁ గళంక సహితములు కావు. వారికి ప్రపంచమంతయు నానందమయము. ఎవ్వారి చెడుగు గోరుటకును వారికిఁ గోరికలు, తదంతరాయమునఁ గలుగుమనోవికారములు (పాలకేడ్చుటదక్క) లేవు. అట్టి నిష్కల్మషుల వాక్కులు

శాపప్రాయము లెట్లగును? వారి కెవ్వరి చెడుగు గోర నేమి హేతువున్నది? అది యశుభసూచక మందురా? అట్లనుట కేమికారణము? † పోచిల్లు చేసిన వారెవరు? నాలుక కా శబ్దమే సులభముగా నుచ్చరింపఁదగియున్నది కావున శిశువు లాశబ్దమునే యుచ్చరింతురు. అంతియకాని తక్కిన యూహా ము లపోహములు. వచ్చీరాని తొక్కుపలుకులతోఁ దన యుద్దేశములను తెలుపఁబూనినపుడు భావము తమకు విస్పష్టముగాకున్నను పరమానందమునొందని మాతాపితరులు లోకమున నుందురా? వారి మాట లర్థము కాలేదని మఱి మఱి యడుగుచో వారు విసుగొంది పో అమ్మా! యనుచోఁ బట్టరాని యామోదమున వారి నెత్తి బిగ్గఁగౌఁగిలించుకొనని జనను లుందురా? అట్లైవరే నుండిరిపో వారిని మానవజాతిలోఁ బరిగణింపరాదు.

సీ॥ అనియత రుదిత స్మితాతి ముగ్ధంబగు
సుతు మోముగాంచని సుఖమదేల?
బాలకాంగ విముక్త పాంసు రేఖాలంకృ
తము గాక యుండు నాతనువదేల?

---

† శకునముచూచుటకై యేదేనొక యింటికడకేగి అక్షతలు నీళ్లాయింటిపైఁ జల్లి పొంచుండి యా యింటివారిమాటలువిని శుభాశుభ ములు నిశ్చయించుట పోచిల్లనఁబడును.

సుత బాల భాషితామృతధారఁ గ్రోలని
కర్ణ రంధ్రమ్ముల కలిమియేల ?
కిలకిలమని నవ్వి కేళిమైఁ బైఁబడు
సుతుఁ గౌఁగిలింపని బ్రతుకదేల ?

తల్లి కుచదుగ్ధమానుచోఁ దన్నుపిల్వ
నలరి క్రేఁగంటిచూపుల నాసగొల్పు
నాత్మజుని ముద్దులాడని యట్టివాఁడు
వసుధపైఁ బుట్టియును లేనియట్టివాఁడు.

అనిన యనుభవ సిద్ధహస్తుఁడైన మహాకవివాక్యములు సంపూర్ణ సత్యములు కావా?

విశాలాక్షీదేవి యనుగ్రహంబునఁ గలిగిన యా విశాలాక్షి బాల్యలీల లాజననీజనకుల నతివేలంబైన యానందజలధి లహరీ డోలికల నోలలాడించుచుండఁ గ్రమక్రమముగా దినములు నెలలు క్షణములుగాఁ గడచుచుండె. ఆ బాలిక వచ్చియు రాని తొక్కుపలుకులు పలుకుచుండుట తలితండ్రులకే కాదు; ఇరుగుపొరుగువారికెల్ల నానంద సంధాయకముగానుండె. ఇటు నటు తప్పటడుగులిడ నేర్చినపుడె విస్ఫుటంబుగ నొడువనేర్చె. తోడిబాలికలతోఁగూడి యాడనేర్చినపుడె పరమేశ్వరలీలలు భక్తితోఁ బాడనేర్చె. బొమ్మరిండ్లుగట్టి క్రీడించుతఱియె గృహమర్యాదలనేర్చె. బొమ్మలపెండ్లిండ్లు సేయుతఱి బంధు

సంబంధములు సంతనగ నెఱింగె. గుజ్జనగూళ్లు సేయు తరుణంబునన యతిథి సంతర్పణంబు నేర్చె. మందిరోద్యానంబులఁ గ్రీడించు నదనున సకలప్రాణులయెడ సదయత నేర్చె. బంగరుటుయ్యాలలఁ జెలరేఁగి యూఁగునాఁడె జననమరణ ప్రవాహమందలి సుఖదుఃఖచక్రంబు దెలిసి తరింపనేర్చె. బంతులాడ నేర్చినతఱి వినయావినయ ఫలితంబులఁ జక్క నెఱింగె. శారికా కీరంబులకుఁ జదువుచెప్పు సమయంబున నిహపర సంబంధంబులఁ గరతలామలకంబుగ నెఱింగె. మదమరాళంబులకు మందగతులనేర్పునపుడె ప్రపంచగతుల నాకళించె. నెమ్మిలకు నాట్యంబు కఱపుతఱినె జగన్నాటకలక్షణంబు లవలీల నవగాహించె. పరిపక్వజన్మ గావున ఋణసంబంధ వస్తువులు తమంతవచ్చి చేరుకరణి సకలవిద్య లామె నాశ్రయించి ధన్యతనొందఁ గాఁబోలు కోరకయే వచ్చిచేరి సముచిత స్థానంబు నొందితిమని పరితుష్టి పరిపుష్టి నొందినవి. ఏడెనిమిది యేండ్ల యీడునకే యాబాలారత్నంబు సకల కలల నేర్చినవారి కరణి మాటలాడుచుండ విన్నవారీ కన్నెక విశాలాక్ష్యనుగ్రహజన్మయనియు విశాలాక్షియే యనియు నపర సరస్వతియనియు ముద్దులమూట యనియు పలుకులచిలుక యనియు పరమేష్ఠి పరిపూర్ణ పాండిత్య ద్యోతక శిల్పమనియుఁ బరిపరివిధములఁ దనివితీర వాకొనుచుండువారు.

పేరునకు గురుండు కావలసియుండ రామకృష్ణులు

సాందీపని యొద్దఁజేరి యఱువది నాలుగు దినములలో నఱువదినాలుగు విద్యలు వినికిమాత్రన నేర్చిన విధమున విశాలాక్షియు నాఁటేసి నెల లొక్కొక్క గురువునొద్దగా పదుగురు గురువులకడ సకల కలల వినినేర్చె. వచ్చినగురువర్యు లబ్బురపడి యనూయగొనక యీయమ భారతి యవతారమని శ్లాఘించుచుఁ దమనేర్చినవిద్య లొప్పగించి తలిదండ్రులకడఁ దగు కానుకలఁ గొనిపోవుచుండిరి. ఒక్కరేని యెక్కువకాలము నిలిచి యధ్యాపకులైన వారు లేరు. బాలేందు లేఖవలె నాబాలికారత్నము క్రమాభివృద్ధి విద్యయందే కాక ప్రవర్తనమందును కాంచుచుండ నట్లే యీయమ కాయమున యౌవనాంకురములును పొడచూపినవి.

## —: వివాహ యత్నము :—

మేను దినదిన మొకవన్నె గాంచుచుండె. అంగములు దిద్దితీర్చిన చిత్రములకరణి నయనానంద కరంబులయ్యె. బాల్యమున నెంత యెడ్డెమడ్డిగ నున్నవారయ్యును తరుణిమ తటి పొట్టకట్టి పైరువలె మనోజ్ఞలై యొప్పుట లోకసామాన్యమై యుండ జన్మముతోడ నందగత్తియయైన బాలిక యౌవనోదయకాలంబునఁ జిత్తజుని చిలుకవలె మనోహారిణియై యొప్పుట యబ్బురంబు కాదుకదా! ఆతరుణి తరుణిమ నొందుడు మన యింటికిఁ గోడలుగాఁ దెచ్చుకొందమని యువ్విళ్లూరుచుండిన

బందుగు లొక్కరొక్కరుగా రాఁదగిన మర్యాదలతో వచ్చి రెండు మూడు పూఁటలు విందుగుడిచి కన్యక మేని సౌరు తీరు నడవడి నొడువుల యొప్పిదంబును పరామర్శించి యీ యమ మానవ మాత్రగాఁ దోఁచదు. కారణజన్మగాఁ గానంబడుచున్నది. మనము కోరియు నబ్బునది కాదు. వృథా విచార ప్రచారము లేలయని పెండిలిమాట ప్రస్తావింపకయే వచ్చిన త్రోవన మరలిపోవుచుండిరి. ఇట్లొక్క యేఁడు కడచె. తల్లి చింత కొంతకొంతగ వృద్ధి కాఁజొచ్చె. భర్తను హెచ్చరించె. అతండును

జాతేతి కన్యా మహతీహి చింతా
కస్మైప్రదేయేతి మహాన్ వితర్కః
దత్తా సుఖం యాస్యతివా నవేతి
కన్యా పితృత్వం ఖలు నామ కష్టం.

పుట్టిననాఁడే పుత్రిక పుట్టినేయని చింత. ఎవని కిత్తునని నాఁటినుండి విడువనిచింత. ఇచ్చితిమిపో సుఖించునో! కష్టించునో! కష్టించనేని యది తీఱనివ్యాధి యగును. అక్కటా! కన్యకు తండ్రియగుట కష్టములలో కష్టముకదా! యను పెద్దలు వచనమునకు గుఱియై లోలోనఁ జింతించుచు కులము రూపు విద్యనడవడి అంతస్తు కలవానిన కదా వెదకవలయు? మన కులమున నొకరిద్దఱుతక్క మెచ్చఁదగిన యుచ్చస్థితికి వచ్చినవారు లేరు.

తక్కినవారికి విద్యాబుద్ధులు చెప్పించి యుద్ధరింతమన్న వారిని పూర్వవాసన విడువక బాధించుచుండుటచే విద్యయందు నాగరకతయందు నాసగొనక కులాచారమైన కూలి మనకున్నది కదా యని విద్య మావంశమునకే యచ్చుదలకాదని చదివి రాజ సభల కెక్కవలయునా? యని పలువిధములఁ దమ మోఱకుఁ దనమును వెల్లడించుచున్నారే కాని సాయపడు వారున్నను అభివృద్ధి గాంతమని యుత్సాహముతో వచ్చువారే కఱవైరే! ఇదియే యిట్లుండఁ గులమును త్రోసిరాజని సాహసింతమా యన్న నడి యడరి పెక్కు చిక్కుల కెక్కయగు నట్లున్నది. ఏమిచేయుదునని యతండు పెను చింతాజలధి మునింగినతఱి నొక్కనాఁడు చంద్రచూడుండను తన యాప్తమిత్రుం డేతెంచి సుహృద్విచార కారణ మారసి యిట్లనియె.

—: కుల గోత్ర చర్చ :—

మిత్రమా! విద్యావంతుఁడవు వివేకివియు నైన నీవును కులము కులమని విచారించుచుండుటచూడ నాకుఁ జాల వింతయై జాలిగొలుపుచున్నది. మన మనుకొనుచున్న కులములు దైవనిర్మితములా? ఈగోత్రములును వంశపరంపరాగతములే యని విశ్వసించుచుంటివా? దేవుని దృష్టిలో నమస్త ప్రాణులును తన సంతానమే యనియుండునా! తారతమ్యబుద్ధి యుండునా? ఉన్నచో నతఁడు సర్వసముఁడగు జగత్పిత యనిపించుకొనునా?

ఇఁక గోత్రచర్చకుఁ గడంగిన నవ్వ్యాల చేటగునని జంకుచున్నాను. ఋషిగోత్రములు చెప్పుకొనుట గౌరవప్రదముగాఁ గొందఱు తలంచుచున్నారు గాని యది తమ న్యూనతను వెల్లడించుకొనుటయే యని నామతము. ఎట్లన, పెక్కండ్రు సామాన్యమానవుల గోత్రముల వింటిమేని మానవ నామమాత్రుఁడగు మూర్ఖశిఖామణి కేని నవ్వు జనింపకమానదు. పిల్లిగోత్రము తేళ్లగోత్రము బల్లిగోత్రము విస్తరాకుల గోత్రము మఱ్ఱాకులగోత్రము ఱోళ్లగోత్రము రోఁకండ్ల గోత్రము మేఁకల గోత్రము పొట్టేళ్లగోత్రము ఎలుకలగోత్రము చిలుకలగోత్రము తెప్పలగోత్రము ఇట్లెన్నని చెప్పుదును? ఇంచుక విచారమతి గలవాఁడిట్టి వ్యర్థములే యనఁగలఁడా? కడకు గోత్రము లెట్లు వచ్చెనా యని యారయుదుమేని యవి కార్యానుకూలముగాఁ గల్పింపఁబడినవని తేలును. చూడుము జనక దశరథుల వంశము లిక్ష్వాకువునుండి చీలినవి. సీతకు రాముఁడేమి కావలయునని పుట్టిన నానుడి వ్యర్థమైనది కాదు. వియ్యంకులగు ద్రోణుఁడు కృపుఁడు ఉతథ్యుని వంశము వారుకారా? పాండవ వంశకర్తయగు పూరువు శ్రీకృష్ణుని వంశకర్తయగు యదువు యయాతి పుత్రులేకదా! వసుదేవుఁడును కంసుఁడును అంధకుని వంశము వారు. అంధకుని తండ్రియగు సాత్వతునుండి చీలినవి కృష్ణసత్రాజితుల వంశములు. పై జతలకు వెవ్వేఱుగోత్రము లుండుటఁ జూడనవి ప్రాస్తావిక కల్పితములని యెల్లవారికిని తెల్లమగుఁగదా!

"కింగోత్రం కిముజీవనం కిముధనం కాజన్మభూః కింవయః
కించారిత్ర్య మముష్య కేసహచరాః కే వంశజాః ప్రాక్తనాః
కామాతా జనకః శివస్య క ఇతి ప్రహ్వేణ పృధ్వీభృతా
పృష్టాః సస్మిత సమ్రమ మూక వదనాః సప్తర్షయః పాంతు వః"

గోత్రమేది ? జీవనమెట్టిది ? ఎంత ఆస్తి ? అతని యూరేది ? వయస్సెంత ? నడవడి యెట్టిది ? అతని తోడివారెవరు ? అతని పూర్వులేవంశమువారు ? అతని తల్లిదండ్రులెవరు ? అని హిమవంతుఁడు ప్రశ్నింపఁగా శివునకై పడుచు నడుగవచ్చిన సప్తర్షులు నిరుత్తరులైరని నీవు వినవా ?

ఇఁక గోత్రమననేమి యని విచారింతము. కొండ, అడవి, వంశము, క్షేత్రము మొదలగు పెక్కర్థములు దానికేర్పడియున్నవి. ఒకపదమునకు పెక్కర్థము లొకేపరి పుట్టవు. సమయోచితముగా పదముల కర్థములు కల్పింపఁబడును. పూర్వులచే నట్లు కల్పింపఁబడినవి నానార్థములని పేరొందెను. తరువాతి వారిచేఁ గల్పింపఁబడినవి జాతీయములయ్యె. ఇప్పటివా రట్లుకల్పింపరాదని కొందఱు మూర్ఖవాదము. అది వ్యవహారమున నడుసునఁబాతిన కంబమువలె నిలువ లేకున్నది. పూర్వజను లిప్పటివారివలె స్థిరనివాసము లేర్పఱచుకొనక కొండలలో గుహాలలో పెనుఱాళ్లక్రింద చెట్లక్రింద వసించుచుండిరి. తరువాతివారు పర్ణశాల లేర్పఱచు

కొనిరి. వారు నివసించుచోట వర్షములేకుండిన నాచోటువిడిచి మఱొకచోటికి (వానపడినస్థలమునకు) తమ కుటుంబములతో వలస తీయుచుండిరి. అట్టికాలమునఁ బుట్టినదే 'ఉత్తరకార్తెఁ జూచి ఎత్తరాగంప' అనుసామెత. తరువాత జనులు రానురాను కష్ట నివారణోపాయముల నాలోచించుచు నిప్పటిస్థితికి రాఁజాలిరి. ఆ పూర్వపువారు తమ యునికిపట్టుల వదలి వేఱుచోటుల కేగునపు డచ్చటివార లిప్పటివారివలె మీరే యూరివారని యడుగ వలనులేక ఏకొండవారని యడుగుచుండిరి. కొండల కా కాలమున పేరులు పెట్టవలసివచ్చెను. ఏమని పెట్టుదురు? అచ్చట వసించుచున్నవారిలో మేటియగు వానిపేర నాకొండను వ్యవహరింపసాగిరి. అట్లేర్పడినవే విశ్వామిత్ర వసిష్ఠ వామదేవాది గోత్రములు. ఇప్పుడును పెద్దలపేరులతోఁ బిలువఁబడు కొండలు నదులు గ్రామములు పల్లెలు పట్టనములీ విషయమును దృఢపఱచుచున్నవి. ఇప్పటికే యెక్కువ వచించితి. నడుమఁ బుట్టినయవి నడుమంతరముననే నశింపఁగలవు. సంస్కరణములకు విద్యావంతులు ధీరులుగాక మఱెవ్వరు ముందంజవైచువారు? 'పెద్దవారలట్ల పిన్నవారు 'యథారాజా తథాప్రజా' యను వాక్యములు నేఁటివికావు.

వృత్తులంబట్టి కులము లేర్పడినవా? కులములంబట్టి వృత్తు లేర్పడినవా? యన్నవిషయము ముఖ్యచర్చనీయము.

కులముల పేరులంబట్టి చూచినచో నయ్యవి వృత్తులంబట్టి వచ్చినవని రూఢియగుచున్నవి. కులములంబట్టి వృత్తులేర్పడిన వన్నచో మొదలఁ గులము లెట్లేర్పడినవని తెలిసికొనఁదగును. సృష్ట్యాదినే భగవంతుఁ డిన్నిజాతులఁ గల్పించెననుట విశ్వాస నీయముకాదు. అట్లైయైయుండినచో నొకరివృత్తు లొకరి కలవు పడక యుండవలయు. అట్లులేదు. చర్మకారవృత్తి నిప్పు డన్ని జాతులవారును చేయుచున్నారు. అట్లే దారు స్వర్ణకార వృత్తు లును. అన్నివృత్తులందఱును చేయఁదగుదురు. ఇఁక ఇచ్చి పుచ్చుకొను వివాహాది సంబంధములు పరికించిచూడ నొక్కొ క్కవృత్తివారు తమలోఁదాము కావించుకొనుట యుత్తమ పద్ధతియని యనుభవ పూర్వకముగా నేర్పడుచున్నది. ఎట్లన, నొకవృత్తిచేయు వానిసంతానము పిన్ననాఁటినుండి యావృత్తియం దలవాటు పడుచుండును. తక్కినవృత్తు లంత సులభముగా నలవడ వీలులేదు. కావున నాయావృత్తులవా రాయావృత్తులవారితోనే బంధుత్వము నెఱపుట చాల మేలు. వారి సంతానమున కా వృత్తి సుకరముగా లభ్యమగుచుండ నందు చాకచక్యమేర్పడి నూత్నవస్తుసృష్టికి దారితీయుచుం డును. అందుచే నట్టి సంబంధ ముత్తమమంటిమి. అట్లుగాక కమసలియింటిపడుచును కుమ్మరి కట్టుకొన్నచో చిన్ననాఁటి నుండి వాడుక పడియున్న వృత్తికి దోహదములేక యాటంకము లేర్పడి తఱుఁగుదల యారంభమగును. అట్లగుటంబట్టి కులా

చారవిధులు తప్పనిసరియైనవి కాని యవన్నియు దేవుని తలఁకుఁ జుట్టరాదు. నూత్నవస్తుసృష్టికి సంకరమే ముఖ్యాచరణమని వస్తుపరిశోధక నిపుణులు నిర్ధారణచేయుచున్నారు. నడుమ వచ్చిన యవాంతరభేదములు నడుమన యంతరింపక తప్పవని పరిణామవాదు లనుచున్నారు. కావున పరిణామవాదము ననుసరించి సంస్కర్తగా ముందంజవైవ దృఢనిశ్చయుఁడ వగుదువేని యనుము. చక్రవర్తి కుమారుఁడు నీయల్లుఁడు కాఁగలఁడు. మఱి చెప్పవచ్చిన నీయనుంగుతనయ కులవాసన యెఱుఁగక రాజాంతఃపురకన్యకగాఁ బెరిఁగి యట్టివిద్యలే నేర్చి యట్టి యలవాటులనే యనుసరించుచు వచ్చినది. కాన స్వకులాచారపరుఁడగు వాని కిత్తువేని యాదాంపత్య మిరుజతయై కోడెను దున్నను కాఁడిఁ గట్టినట్లుండును. దున్న నీడకీడ్వఁ గోడె జాడకీడ్వ నడుమఁదగులువడిన బండివలెనుండును అట్టివారి సంసారయాత్ర! నీ కుమారి సుఖింపఁదలంతువేని మీకులవృత్తి నాచరించువారి కీయకుము. ఆమె జీవితమును చింతాదేవతకు బలి యీయకుము.

అని యిట్లు దీర్ఘోపన్యాసము గావించిన మిత్రుని వచనముల కత్యంతము తృప్తివహించి సుధాముఁ డిట్లనియె, సుహృద్వతంసమా! నీవచనము లవశ్యాదరణీయములు. నీ మార్గ మత్యంతశ్లాఘా పాత్రము. 'ఇట్టిపట్టులఁ దలఁచుగా నింటివారు భార్యలే నేత్రములుగాఁగ వఱలువారు' అనుపెద్దల

వాక్యము వినవే? యనుటయుఁ జంద్రచూడుండిట్లను. నీయిల్లా లుత్తమసాధ్వి. నీతలంపులకుఁ బ్రతికూలంబుగా నడవఁ దలంపదు. అయినఁ బ్రశ్నించియే సమాధానపడుము. తేపు తేపకడ వత్తునని యతండు కార్యార్థియై యెందేనిచనియె. చింతాకుల చిత్తుండైన సుధాముఁడు తనయున్న చావడిగదికి కులకాంతను రప్పించి తనకును మిత్రునకును జరిగిన సంభాషణ మాద్యంతము వినిచి యిందు నీయుద్దేశమెట్లుండునో తెలియ వలతు ననియె. ఆయమ చాలసేపు మౌనధారిణియై యుండి యూవల నిట్లనియె.

కసవున్న గాఁటిలోఁ బసిని గట్టుమని పెద్దలందురు. విశ్వేశ్వరుఁ డిచ్చిన యింతో అంతో మనబిడ్డకుం జాలును. కాన ఆస్తికలవాఁడే కావలయునను నవసరము లేదు. విద్యకు నీతిప్రవర్తనమునకు సంబంధము చాలవఱకు లేదని యను భవజ్ఞులు పెక్కుదాహరణములతో వచింతురు. విద్య యుండియు నీతిరహిత ప్రవర్తనము గర్హ్యము. అవిద్యా వంతుని నీతియు సభలఁబ్రబలి ప్రకాశింపదు. ఈరెండు నవినా భావ సంబంధముతో నుండందగు. ఏది యెంతయుండినను రూపముఁగోరుట కన్యలకు సహజము. 'ధన్యాః లోకమనోభి రామఁ గులవిద్యా రూప తారుణ్య సౌజన్య శ్రీ బల దాన శౌర్య కరుణా సంశోభితుః నిన్ను నే కన్యల్గోరరు? అని రుక్మిణీదేవి వచించినది. మీకుఁ దెలియని యంశంబులే నేమని

చెప్పఁగలదని తలంచితిరా ? అడుగవలసిన లోకధర్మముంబట్టి యడిగితి రంతియకాక మీకిదియగు నిదికాదని దిద్దవలంతినే ? ఇంతకుం గుమారి యుద్దేశ మెఱుంగుటయు సముచితంబని నాకుందోఁచుచున్నది. పిలిచి యొక్కమాట యడుగుఁడు. అన్నింట ముఖ్య మనుకూలం దాంపత్యము కుదుర్చుటకదా ? అనుటయు సుధాముఁ డయ్యవసరంబున నొక్కపరిచారికం బిలిచి పుత్రికం బిలుమనియె. ఆయమయు వెంటనే తోడితేర వచ్చినకుమారిని తండ్రి చేరఁజేరి పజ్జఁగూరుచుండఁ బెట్టుకొని 'తల్లీ ! నీవిషయమే యిట నాలోచించుచుంటిమి. నీకు వివాహ యోగ్యమగు వయసు వచ్చినది. తల్లిదండ్రులు కుమార్తెకుఁ దగిన వరుని కూర్చుట లోకధర్మమైయున్నది. ఇట్టియెడ నీ యుద్దేశ మెద్దియో నన్నెఱుఁగుట మాయవశ్యకర్తవ్యమై యున్నది. అనవుడు కన్యకామణి చిఱుసిగ్గున నించుక తల వాంచి చేనున్న లీలాకందుకంబు నిటునటులాడించుచు నల్లన నిట్లనియె.

నాయనా! మీయిష్టంబున కెదురాడరా దనుటకంటె వేఱొం డు తలంపు నాయెడందలేదు. నా మేలు కోరుకంటె నితర చింత నంబు మీకులేనికతంబున స్వసుఖచింత కవసరమేమియున్నది ? బాలికను. లోకజ్ఞానహీనను. అట్టి నన్నడుగనేల ? అని లేచి యట నిలువక వెడల యత్నించునంత నొక సేవకుఁ డరుగుదెంచి

వినయసంభ్రమంబులు తోఁప నొదుఁగుచు నిలిచి దేవరా! వ్యాసమహర్షులవారు వాకిట నిలిచి తమరాకను తెలుపఁగోరిరి. సెలవే? యన, వెంటనే వారిని లోనికిఁ బిలుచుకొనిరమ్మని పంపుచు సుధాముఁడును లేచి యెదురేగెను. వచ్చినవారు వ్యాసభగవానులు! ఏమివింత! ఏమి మాభాగ్యము! మాజన్మములే సఫలములైనవి. అని సాష్టాంగ నమస్కారము గావించి పాణిగృహీతి తెచ్చిన పరిశుద్ధజలంబుల నతనిపాదంబులు గడిగి శిరంబునఁ జల్లుకొని యతని మెల్లన లోనికిఁ దోడితెచ్చి యుచితాసనంబునఁ గూరుచుండఁజేసి క్షేమవార్తలాడి యిల్లాలిని కూఁతును నమస్కరింపఁజేసె. స్థిరసుమంగలి వగుమని యాసాధ్వీతిలకము నాశీర్వదించి కుమారింగని యన్యదుర్లభుఁడైన పతియనుగ్రహ మచిరకాలంబున నొందఁగలవని హస్తంబు శీర్షంబుపైనుంచె. ఆతిథ్యమై యెల్లవారు కుడిచికూర్చున్న మీఁద సుధాముఁడు పారాశర్యుంగాంచి తపోధనాగ్రగణ్యా! నియతాహారులై నియతవ్రతులై నిత్యతృప్తులై లోకసంగంబు మాని యేకాంతవాసులై యాత్మారామ సందర్శనానంద కందళిత హృదయులై యుండు మీబోంట్ల కన్యులతో నిసుమంతయేని కార్యంబు గలుగదు. అట్టివారిక్లేశెంచుట మము బోఁటి పతితుల నుద్ధరింపందక్క నన్యంబు కతంబు కలదే? ఏదేని మావలనఁ గాదగు కార్యంబు గలిగెనేని మాజన్మం

బులు ధన్యతమంబులు కావే? వినఁదగు నాజ్ఞ కలదేని యాన తియిండు. అని విజ్ఞాపింప సాత్యవతేయుండు చిఱునగవు మొగ మున నిసుమంత కానంబడ నిట్లనియె.

సుగుణధామా! సుధామా! కార్యంబులేక మావంటివా రేలవత్తురు? ఈలోకంబు పరస్పర విభేద కారణంబున ననూయా గ్రస్తంబై యున్నయది. జాతిమత ద్వేషంబులీ జగంబును వీడి పోవనంతకాలంబు సుఖంబునకుఁ దావలంబెక్కడిది? పెద్దచేఁప లు పిన్నచేఁపల మ్రింగుమాడ్కి బలవంతులు బలహీనుల లొం గఁదీసికొని బానిసపనులు చేయించుకొనుచు వారిని తలయెత్త నీయకున్నంతవఱకుఁ బ్రపంచశాంతి కలలోనివార్త. కడుపునఁ బెనుమంట లెగయుచుండ హృదయమున శాంతి యెట్లు నిలువఁ గలదు? మునివృత్తి సుఖజీవనోపాయంబని సోమరులు కొంద ఱు నిశ్చయించుకొన్నపిదప నిక్కంపు మునులకు గౌరవమెక్క డిది? ఆసోమరిపోతులంగాంచిన యఱగొఱ మునులకు నాన యధికమై యాత్మారామునిపైనుండిన చిత్తము ఆస్తిపాస్తుల పైకి మరలినది. అట్లయ్యు మీవంటి కొంద ఱుదారాశయుల యాధారమున సత్యధర్మములు విజ్ఞానుల మర్యాదలు లోక మున నిలిచి నారాయణున కవతారశ్రమము తగ్గించుచున్నవి.

అనుడు సుధాముఁ డించుక యనిష్టము సూచించుచు స్వామీ! అంతటిస్తుతి కనర్హుఁడ. అట్టి ప్రాస్తావికస్తుతు లవ్వా

లికినెట్టి వచ్చినకార్య మాదేశింపుఁడు. శక్తివంచనసేయక నెఱి వేర్ప సంసిద్ధుఁడ నన నప్పలుకాధారముగఁ గొని పరాశర పుత్రుం డిట్లను. ఏను నిన్నొక విద్యనర్థించి శిష్యత్వము సేయ వచ్చితి నన్నతోడన యులికిపడి యతఁడు మహానుభావా! మీరు నాకు శిష్యులగుటయా? ఏమి నేర్చుటకు? అర్థశాస్త్రమా? మాకులవిద్యయా? మీపలుకులు వింతగలిగించుచున్నవి. సముద్రము పిల్లకాలువ నాశ్రయించి యేమి గడింపఁగలదు? అనిన నమ్మౌని, శౌండకుల మండనా! కలదు కలదు. పిల్లకాలువలు చేరియే సముద్ర మగుట. మీబోఁటి పెక్కండ్ర యొద్ద పెక్కువిద్యలు గడించికదా కొలఁదిపాటి గ్రంథ రచనకు వలఁతినని పేరొందుట! అనన్యసాధ్యంబగు విద్య యొక్కండు మీయొద్దఁగలదు. మీరు కోరినంతనే యనుకూలముగఁ దాటి యీఁతచెట్లు వంగుచున్నవి. వేదములెంత వల్లించినను అఱువది నాలుగుకళల నాకళించి యవఘళించినను మీ విద్య మిమ్మాశ్రయించి కాక వేఱు విధమున లభించునది కాదు. కాన మిమ్మర్థింప వచ్చియున్నాఁడ నన సుధాముఁ డదియా కార్యంబని శిరంబు పంకించి యొక్క పద్ధతికి మీరీయకొంటి రేని దాని నుపదేశింప మా కభ్యంతరాయము లేదనుటయు వ్యాసుం డయ్యది యాదేశింతురుగాక యనియె. మీరు మాయెడ గురు భావంబు ప్రకటింపకుండు మని మాటయిత్తురేని మావిద్య నేర్పుదునని గృహస్థ శిరోమణి తెలుప నట్లేయని సన్న్యాసి

యియ్యకొనియె. అంత నమ్మార్గ మతఁ డుపదేశించి దారిసాగ
నంపి మరలుతఱి వ్యాసుఁడు వినయముచూప యత్నించు
చున్నంత వలదని యతండు మరలి స్వగృహంబుచేరె.

తదనంతరము కొంతసేపటికిఁ గొందఱు పనివాండ్రు
పఱతెంచి బుద్ధిబుద్ధి దేవరా! కల్లుగీతకు చెట్లు వంగకున్నవి.
దేవరయాన యన్నను ప్రయోజనము లేదయ్యె నన నతండు
వింతపడి కారణమారయఁ జాలక చాలసేపుయోచించి యేమి
యుఁదోఁచక మీరేగి నేటి తక్కుంగల పనుల నెఱవేర్చు చుం
డుఁడు. ఇంతలో కత మూహించి విఘ్నంబునకుఁ బ్రతిక్రియ గా
వింతమని వారినంపి లోనికేగి యిల్లాలితో నవ్వింత వృత్తాంత
మెఱింగించునంత నయ్యమ వింతపడక నాథా! మీరింకను కార
ణ మారయఁ జాలకున్నారా? వచ్చిన యతిథివలననే యింత
జరిగె. అతనికి మనవిద్య నుపదేశింపరాదని యడ్డుపడ యత్నిం
చియు మీకు నిరోధము కలిగింపరాదని యూరకుండి యా
దోసమున నేనుకొంత పాలు గొంటిని. నేఁదలఁచినట్లే యయ్యె.
మీఱిన దానికై చింతించి ఫలములేదు. మీరిప్పుడే త్వరపడి
పాదచారులై వడివడింజని యమ్మునింగాంచి యాతండు మిమ్ము
చూడకమున్నే మునివరా! వందనములని నమస్కరించి యాపైఁ
బలుకరింపక మరలిరండు. మనకార్యము సిద్ధించునని యమ్మహా
సాధ్వియన నాతండును ముందు వెనుక లాలోచింపక చెచ్చెర
నమ్మునిని సాగనంపిన దారింబడి నడచె.

సుధాముఁడు వెంబడించి వచ్చుచున్నాఁడని వ్యాసుఁడు తనవిశేషజ్ఞతచే గ్రహించి యుపాయమూహించి దారిదరినున్న మఱ్ఱియూడల మాటున మఱఁగి నిలుచుండెను. కొంతవడికి సుధాముఁ డమ్మార్గమున వచ్చువాఁడు సాత్యవతేయుం గానక మఱింత వడిగా ముందునకు నడచుచుండె. తనకు సూటిగా వచ్చినతఱి పారాశర్యుండు 'గురువర్యా! మీశిష్యుండు భవత్కృపాలబ్ధ విద్యుం డిదె మీపదముల కతిభక్తి నమస్కరించుచున్నాఁ' డని సుధాముని పాదద్వయముపై వ్రాలె. అతఁడేదియుఁ జేయునదిలేక యప్పటికిఁదగిన వాక్యంబులాడుచు 'నీవు గురుద్రోహివి. నాకు వందనముచేయరాదని తెలిపియుండియు వంచన బుద్ధిచే దాని మీఱితివి. ఇయ్యది నీస్వయం కృతాపరాధమని నేఁదలంపను. కచుఁడు శుక్రునొద్దకువలె వచ్చితివనియే నిశ్చయించుచున్నాను. నీయీ పాపకృత్యంబునకు ఫలంబుగా నచిరకాలంబునఁ దిండినీరులేక కొంతకాల మల్లాడుదువు గాక యని యించుక కటువుగ నాడి నీగ్రహించినవిద్య గురుద్రోహ ఫలప్రాప్తికే గాని స్వలాభమునకుఁ గాదు. నీవు రెంటికిం జెడ్డ వాఁడవు కావునఁ బ్రోత్సహించి తమకుఁదగిన యాయుధంబుగా శ్వేతవర్ణులు కొందఱు నిన్నుపయోగించుకొన్నారు. నీమోము చూచుచున్నకొలంది నామనంబు కలంకితమగుచున్నది. మాకువలె మీకు నీవిద్య ఫలియింపకుండుఁగాక యని గిఱుక్కునం దిరిగి యిరవున కరుదెంచి యిల్లాలింగాంచి కడచిన వృత్తమెల్లఁ

బూనగ్రుచ్చిన తెఱంగునఁ దెలుప నా సతీమణి యిఁకమించి నదానికి వగచి ప్రయోజనంబు గలదే? ఉన్నదానితోఁ దృప్తి నొందుట యుత్తమలక్షణంబు. అయినను మన సంఘపరంపరకే శాశ్వతద్రోహము మనవలనఁగలిగె ననుటమాత్రము మిక్కిలి దుస్సహవేదనాకరము. అని యాక్రోశించెడి యిల్లాలు భర్తను లోనికిఁ గొనిపోయి యుచిత వచనమ్ముల నూరార్చుచుండె.

—: వ్యాసుని పశ్చాత్తాపము :—

అట వ్యాసుఁడు తాఁజేసిన ద్రోహకార్యమునకు గురుని దూషణవాక్యములకు పశ్చాత్తాపమంది 'అకటా! నాచంచల మతి నన్నెంతటి ద్రోహకార్య మాచరింపఁజేసినది! లోకమున నావంటి విశ్వాసఘాతుకుఁడు మఱిపుట్టఁడను నిందనొందితి. నాజన్మము నీచము. నావంటి విజ్ఞానగర్విచేఁ గలుగునది లోక మునకు ద్రోహమేగాని క్షేమమెన్నటికిఁ గాఁజాలదు. నే గ్రహించినవిద్య నాగురునకును వారిజాతికిని లేకచేసి నేనేమి యనుభవించితి? ఇఁకదీని నెవ్వరికి నేర్పి యేమి వారుగొందు? నన్ను నిర్బంధపఱచి నియమించిన వారికీ విద్యాగ్రహణము వలన నిసుమంతయేని లాభముగలదా? వృథాస్వార్థ భంగము గావించెడి వార లెవ్వరో? యను కవివాక్యము నాయెడ నన్వర్థమయ్యె. పరోత్కర్ష మించుకయేని సహింపని శ్వేత రక్తము నాయందు సంక్రమించుటంజేసి యిట్టి నీచాతినీచంపుఁ

బని కొండిగట్టితి. అచ్చంపు భారతీయుండనై యుండిన నిట్లు కావించియుండను. అని మిక్కిలి పరితపించుచుం జనువాం డెదుర ముని సంతానముంగాంచి నమస్కరింప వార లాత్ర ముతో పోయిన కార్యంబు సఫలంబకదా? ఏల మోము వాడి యున్నది? నిష్ఫలమా? నీవు తలంచిన కార్యముకూడ నిష్ఫల మగుట కలదా? మాలో మావాండవై వారిలో వారి వాండవై కలిసి కార్యము సాధింతువనికదా నిన్నంపినది? అయ్యది మనకు ఫలింపకున్నను వారికి లేకున్నంజాలునని తలపోసియే నిన్నంపితిమి. తుదకది యట్లే యయ్యెనా? అయి నను చెడునదిలేదు. ఎదుటివారి కొక్కటితగ్గిన మనకొక్కటి హెచ్చినట్లేకదా నిశ్చయింపవలయు? ఏమయ్యె వినంగోరెద మని మునిజనులు తత్తఱింపం గానీనుండు జరగినది యామూలా గ్రము విశదీకరించె. అంతయు విన్నపిదప వారలిట్లనిరి.

ఒక్క సంఘక్షేమముకొఱ కొక్కండు తన జీవదానము చేసెనేని యది యిరువురకును సుఫలదాయకంబై యుండు. ఎట్లన ప్రాణత్యాగముచేసిన వానికి స్వర్గసుఖము. సంఘమున కిహసుఖము. దీనికింత విచారమేల? యనుడుం బారాశర్యుండు పరులపై మనము ప్రయోగించు నస్త్రంబు నాపైనే మీరు ప్రయోగించుచున్నారు. తల్లి పుట్టింటి గౌరవము మేన మామల యొద్దనా పొగడుట! తాతకా దగ్గులునేర్పుట! చాలుంజాలు. మీపలుకులు విన సహింపవు. నాపాతము నాకే

యొప్పగింపకుండు. నీటిలోనిచేప కీంత నేర్ప నవసరములేదు. మోసపోయితి. చెడితి. వ్రాంతలలోను చేంతలలోను నన్నొక సాధనముగాం గొంటిరి. మున్ను కచునింబోలె సుకృతి నంపు టయుం దత్ఫలితము లెఱింగియుండియు మీావలం దగులువడిన నన్ను నే నిందించుకొనవలయుంగాక. కచుం డమృతసంజీవనిం గ్రహించియు గురుశాపముచే విఫలుండగుటయు సుకృతి కుల ము నే తొలంగుటయు నెఱింగియుండియు 'కమనీయంబగు వేంటకాని పదురాకర్ణించి నిక్కంబుగాం దమచిత్తంబులం జేర్చి చేరి హరిణుల్ తద్బాణ నిర్భిన్నలై యమితోగ్ర వ్యథ నొందుభంగి' నైతి ననుచుండ వారు పారాశర్యు నూరార్చుచు సుకృతి యెవండు? వానిచరిత్రము మేమెఱుంగము. వినవలతు మనవుడు వ్యాసుం డిట్లనియె.

—: సుకృతి కథ :—

తొల్లి యవనదేశమున జ్యోతిశ్శాస్త్రమందు ఫలాధ్యా యము ప్రబలియుండె. దానినెట్లైన గ్రహించిరా నార్యులాలో చించి కచునివలె నన్నువలె సుకృతి యను నధిక మేధాశాలిం బంప నిశ్చయించిరి. అతండు స్వకులజుల యొద్దను కులపతుల యొద్దను కొన్నినియమములు కావించుకొని యెన్నిపాటులు పడియైన నావిద్యను గ్రహించి వచ్చెదనని బయలుదేఱెను. నౌకాయాత్రయు యవనభోజనము శాస్త్రనిషిద్ధములై యుండెం

గావునను యవనభాషయే యుచ్చరింపరానిదని యాజ్ఞనియమము గావునను సుకృతి యట్లు కావించు కొనవలసిన వాఁడయ్యె.

ఆతఁ డాతీరున నియమముచేసికొని బయలుదేఱి మార్గమునఁ బలుకష్టములకులోనై కడగండ్లు వడుచు నోర్పుమై చాల కాలమునకు యవనదేశముం జేరెను. ఏపండితు నాశ్రయించినను తదీయ దేశాచార సంప్రదాయముల ననుసరింపక చేర వీలులేదయ్యె. తుదకాతఁడు వారిమతము స్వీకరించి తదాచారము లలవఱుచుకొన్నపిదప విద్య నభ్యసింప మొదలిడెను. తనకుఁ గావలసినది ప్రారంభింపఁ బడక మున్నే యవను లతని కొక కన్య నంటఁగట్టిరి. ఆపెతో నతఁడు కాఁపురముచేయుచు జ్యోతిశ్శాస్త్రము పూర్తిగ గ్రహించునంతకు మువ్వురు బిడ్డల తండ్రి యయ్యె. కావలసిన విద్య పూర్తియయ్యెను. దేశాభిమానము పూర్వ కులాభిమానము మెండుగఁగల యాయార్య తురుష్కుఁడు భార్యను బిడ్డలను బంధువులను దేశీయులను మోసగించి యొకనాఁ డర్ధరాత్రంబున నేకాకియై బయలుదేఱి తెల్లవాఱునంతలో రెండామడలు దాఁటెను. ఉదయమున నాయూరివా రా విప్ర తురుష్కుని గానక పరిపరివిధముల నాలోచించి తుదకు మోసము జరిగెనని నిశ్చయించి వానిని వెదకి పట్టి కఠినముగ శిక్షించి ఖండతుండములుగ నఱకవలయునని వారి ప్రభున కెఱింగించిరి. అతఁడు వారికిఁ దోడుగఁ గొంత

సేననంపి యావంచకుని పట్టి బంధించి తెండని యాజ్ఞ యొసంగెను.

పండితులు పౌరులు వీరులుచేరి సుకృతింబట్టఁ బయలు దేఱిరి. ఆయుదంతము సుకృతి యెఱిఁగి వడివడి నడవసాగె. శాస్త్రవేత్తలైన యవను లాయార్యుని పోకడ యెఱిఁగి యెఱుక పఱచుచుండఁ దక్కినవారు దారిం దడఁబడక నూటిగా సుకృతిని వెంబడించి వచ్చుచు నాలవనాఁడతని సమీపించిరి. అది యెఱిఁగి సుకృతియుఁ దప్పించుకొను తెరవు యోచించి యొండు కొండనెక్కి యందొక్కగుహం బ్రవేశించి యటఁ జచ్చిపడి యుండిన శార్దూలపుఁ జర్మము నొలిచి కప్పుకొని గొంతు గూర్చుండి దేవుని ధ్యానించుచుండెను. యవను లాకొండ క్రిందికి వచ్చి విడిసి హైందవుఁ డెచ్చటనున్నాఁడో యని శాస్త్ర దృష్టిం బరికించిరి. పులిచర్మ మతఁడు కప్పికొనియుంటచేఁ బులికడుపున నున్నాఁడని నిర్ధారణచేసి పులికడుపునఁ బడిన వానికి పుట్టుగతులు లే వని దైవమే వానికిఁ దగు దండనము విధించెనని తృప్తివహించి వాని పీడ నేఁటితోఁ దీఱెనని వచ్చిన త్రోవను మరలిరి.

బ్రదికితి దేవుఁడా యని సుకృతి కుధర కుహరమునుండి యీవలికివచ్చి వారి యల్పజ్ఞత్వమునకు లోలో నవ్వుకొనుచుఁ దన దేశమును చేరెను.

మున్ను గ నీవిద్య పదుగురకు నేర్పి పదపడి కఠిన ప్రాయశ్చిత్తము చేయించుకొన్నచోఁ దమలోఁ గలుపు కొందుమని వైదికులు ఖండితవాక్కులాడిరి. మునుపటిమాట యేమయ్యెనని సుకృతి వాదించియు ఫలము లేకపోవుటచే విసిగి కార్యసాధకముకై బొంకులాడు వంచకులతోఁ జేరనని శపథవాక్యములాడి కులద్వేషమూని వారికావిద్య చెప్పక వారి యాచారములకు విరుద్ధముగ నడవ నిశ్చయించి యొక చండాల కన్యం బెండిలియై జ్యోతిషికవృత్తితోఁ దనజీవితము కడపు చుండె. అతని సంతతివారికే యావిద్య దక్కె. వారు వళ్లువు లని పిలువఁబడి దక్షిణదేశమునఁ బ్రజాగౌరవ మందుచున్నారు.

వింటిరా! మీతోడి సాంగత్య మిఁకఁజాలు. మీపర పాండిత్యాసహనము స్వార్థపత్వము. మీకుహనా తంత్రములు చాలకాలము సాగిరావు. త్వరలోనే యధఃపతనము సంభ వింపఁగలదని కటువాక్కులాడి యట నిలువక యెందేని చనియె.

—: బ్రహ్మచారి సుధామ నను గ్రహించుట :—

ఎప్పటియట్ల చెట్లువంగుట కెన్నియుపాయము లాలో చించియు వ్యర్థము కాఁగా సుధాముఁ డధిక నిర్వేదమంది సంఘ మునకే తీఱనిచెడుగు చేసితిఁగదా! సర్వేశ్వరా! ఇఁకఁ ద్రోవ యేది? యని రేయుంబవలు విడువనిచింతతో నాలోచించు

చుండె. అతనిం గరుణింప నెంచిన శివుఁడతిలోకసుందర బ్రహ్మచారియై యొకనాఁడు రాజవీథింబడి నడచుచుఁ దన్నుఁ గాంచిన యా బాలగోపాల మల్లె తనసౌందర్యామృతమును తమ నేత్రాంజలుల వారివారి గ్రోలుచుండఁ దానెవ్వరిం బలుకరింపక సుధాము నిజధామమ్మున కరుదేర నా గేస్తతనింగాంచి రూప లావణ్య తేజో విశేషంబుల కబ్బురంపడుచు నెదురేగి తోడితెచ్చి యుచితాసన మొసంగి 'యువకలోకతిలకమా! క్రొత్తవారలుగ నగపడుచున్నారలు. ఊరెయ్యది? పేరెయ్యది? వచ్చిన తలఁపెయ్యది! నావలన నేమివలయు వచింపుఁడు. ఉన్నతవిద్య నార్జింప నియ్యెడ కరుదెంచితిరా? వ్యాపారార్థులై యేతెంచితిరా? మాశుభంబు కోరి కాక మీవంటివా రూరక యేల యేతెంతురు? వలచినది వచింపుఁడు. శక్తివంచన సేయక కావింతుననఁ నా బ్రహ్మచారి సుధాముని సాదరమేదుర వీక్షణంబుల వీక్షించి 'పుణ్యాఖనీ! ఏనొంటరివాఁడ. ఎవ్వరివాఁడనని యెట్లందు? ఎంత చింతించినను జన్మస్థాన మాకళింతకురాదు. తల్లిదండ్రులు తలఁపున లేరు. సుజనులెల్లరు నాచుట్టంబులై యుంట నావారలని యెవ్వారిని వేఱుపఱచి వాకొనఁజాలుదు? నాచూడని ప్రదేశంబులేదు. నాకవగతము కాని విద్యలేదు. నాయాడని యాట పాడనిపాట లేదు. సజ్జను లెచ్చటనుందు రచ్చట నిలుతు. తక్కుచోట్ల నిలువనొల్ల. లోకోపకారుల చింతల వంతలఁ బాపుటయే నాపరమవ్రతంబు. కడచిన రేయి

నాలవ జామున కాశీ విశ్వనాథుండు కలలోఁ గానంబడి సుహృద్బాంధవుండగు సుధాముఁడొక్క మనశ్చింతం జిక్కి మఱుఁగుచున్నవాఁ డతని యెడ కేగి తచ్చింతం దొలంగించుట నీముఖ్యకర్తవ్యమ్మని యాజ్ఞాపించి తిరోహితుం డగుటయు వెంటనే లేచి నీయింటిజాడ నరయుచు నరుదెంచితి. నీమోముఁ గాంచినంతన నీచింత యెఱింగితి. ద్విజాతుఁ డొకండు మీ కులాచారవిద్య నపహరించి మీకులమువారికే యెగ్గు తలఁచి నందున విచారించుచున్నాఁడవు. నేఁటినుండి మీవిద్య నీ కనుగ్రహించితి. నీయనంతరమది నీవారికడ నిలువదు ఇఁక సెలవే? యనుడు సుధాముఁ డచ్చెరువంది మహాశయా? మీచరిత్రము విచిత్రపాత్రంబుగా నున్నది. మీరిట్టివారని యూహింపఁ జాలకున్నారము. అమానుష దివ్యతేజులరు. అఘటనాఘటన సమర్థులరు. అంతియకాదు, లోకోత్తర సుందరరూపమంది మమ్మనుగ్రహింప వచ్చిన యిందుధరరూపులరని నిస్సంశయంబుగ నిశ్చయించుచుంటి మనుచుండ విశాలాక్షి యొక్కపరుగున నరుగుదెంచి నాయనా! పనివాండ్రు నేఁడు తరువులు లొంగి వంగుచున్నవను సంతోష వార్త వాకిట వినిపించుచున్నారని వచించుచు జనకునిసన్నిధానమున నాసీనుఁడై యున్న నూతన సుందరాకారుంగాంచి మేను ఝల్లుమని ముచ్చెమటలు గ్రమ్మ నట నిలువఁజాలక గిరుక్కునఁ దిరిగి యావలికేగె. ఏగిన మగువ యట్లే పోవంజాలక మఱుఁగున నిలిచి తనివితీరక యాగంతుకు

నొడలి బెడఁగు ఱెప్పవాల్పక కాంచుచుండ మనసు పలు పోకలఁ బోవుచుండె.

సుధాముఁ డాశ్చర్యానందము లనుభవించుచు మహా పురుషా! తాము మాయింట నీపూఁటయుండి మమ్మనుగ్ర హింప వేఁడుచుంటి. మీయనుగ్రహము వాగ్రూపమున వెలువడి వెలువడకమున్నే కార్యరూపముం గాంచుటయే తా మసాధారణ మహిమా సంపన్నులరని చెప్పక చెప్పుచున్నది. దానికి మానవాతిరేక సౌభాగ్యమే సాక్ష్యమిచ్చుచున్నది. ఈ సర్వస్వమ్ము మీసొమ్ము. ఇట మీ కెట్టి యాటంకము లేదు. నేఁటి కిట విశ్రమింపుఁడు. నేఁటి కేగాక యెంతకాలము నిలిచి నను మాభాగ్యాతిశయమని భావింతుము. అనుడు నావడుగు సొ బగుండు చిఱునవ్వు మోమునఁ జిందులాడ మీగేహము నాగే హముగనే భావించితి. మీరు తలంచినపు డే తెంచుచుండు నని సెలవంది యతండు కొంతదూర మరిగి మఱుఁగువడియె.

అతఁ డెవ్వఁడు? తనవృత్తాంత మడిగియు విస్పష్టముగఁ జెప్పక యేలదాఁచె? పలికిన పలుకులు ద్వ్యర్థిగనుండె. సర్వే శ్వరుండె మమ్ముద్ధరింప నిట్లే తెంచెనని నిశ్చయించుట నిర్భరా నందసంధాయకంబు కదా? వ్యాసుఁడు చేసిన మోసమును గ్ర హించి యనుగ్రహింపవచ్చిన మహాపురుషుండు మహాదేవుండు గాక మఱెవ్వఁడై యుండు? విశ్వనాథుఁ డీకాశీపురి నిత్యనివాస

ముగాఁ జేసికొని భక్తాభీష్టదాయియై యుండునంతకాలము మన కేమికొదువ? యని యానందించుచు లోనికిఁ జనునంతఁ దన తనయయుఁ దనవలెనే తలపోయుచుండుట నామె మోముఁ గాంచి యూహించి తల్లీ! ఏమట్లు చింతించుచుంటి వనునంత నాకన్నెకయుఁ దన్నుఁ దానెఱింగి యొడలి యుడుపులు సవరించు కొనుచు తండ్రీ! విశేషములేదు. మనయింటి కరుదెంచిన మహా పురుషుఁడెవ్వఁడా యని విచారించుచుంటి. అతఁడు మనపాలి భాగ్యదేవతయో యిలువేల్పు శ్రీ శ్రీనివాసుండో కాశీవిశ్వ నాథుండో యైయుండఁదగు నని తలపోయుచుంటి ననుడు నతండు సమాధానపడి యేనునట్లే భావించితి ననుచు నిత్యకృత్యంబులు నిర్వర్తింప లోనికేగె.

నూతనాగంతుకుని వృత్తాంతంబంతయుఁ గూఁతువలనఁ దల్లి వినుచుఁ దనయ మనోవికారంబు లామెమోమునఁ దెల్ల బుగ నెఱింగి నాముద్దులమూటా! ఊరుపేరు తెలియని క్రొత్త వారింగూర్చి యిట్లాలోచించుట నీవంటివారికిఁ దగదు తల్లీ! అ య్యది చిక్కులకుఁ గారణమగును. వచ్చినయతండు మనమేలు కోరియేకాని వేఱొండుకాదు. అట్టివాఁడు విశ్వనాథుఁడో వేంక టేశ్వరుఁడో తక్క వేఱెవ్వరై యుందురు? వారు మన యిలు వేలుపులు. వారికి భక్తితోఁ బ్రణమిల్లుట దక్క వేఱేమి చే యఁగలము? చూడు! ప్రపంచగర్భునకు నైవేద్యమెంతని పెట్ట గలము? పెట్టిన నది యతని దృష్టిలోఁ బరమాణువులలోఁ

బరమాణువు! వినుతింత మందమా? వారు స్తుతిప్రియులు గారు. స్తుతిప్రియత్వము దేవ లక్షణము కాదు, అల్పుల లక్షణము. మన తృప్తికొఱకు మనము వినుతింతుము కాని వారి తృప్తికిఁ గాదు. వారు దయచేసిన బుద్ధ్యనుసారము మెలఁగుటయే వారి కానంద దాయకము. తదనుగ్రహదాయకము. తండ్రియాజ్ఞలఁ జెల్లింపక యెదుటనిలిచి 'జనకా! నీవు బుద్ధియందు బృహస్పతివి! సత్య వాక్కున హరిశ్చంద్రుఁడవు. దానంబునఁ గర్ణుండవు అని పొగ డుచుండు తనయుని తండ్రి మన్నించునా? దండించునా? పరికించి చూడుము. అని జనని యించించుక తన మనసునెఱిఁగిన కరణి వాచింప నమ్ముగుద లజ్జావనతవదనయై 'తల్లీ! ఏమేమో మాటాడుచున్నావు గదమ్మా! సర్వేశ్వరధ్యానము సర్వజను లకు సర్వదా కర్తవ్యము. అదిముఖస్తుతి కానేరదు. పానీయం బులు త్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాస లీలా నిద్రాదులు సేయుచున్ నడచుచున్ లక్షించుచున్ సంతత శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృత స్వాదు సంధానుండై మఱచెన్ సురారి సుతుఁ డేతద్విశ్వమున్ భూవరా! అని చదువమా? మనసు నర్పింపని మనన మదియేటికి? మనసు నిలుపలేని మంత్రంబు లేలరా అన్నవారు వెఱ్ఱివారా? మాధ వున కర్పింప వలసినది మనస్సా? మంత్రమా? అనిన కుమారి వచనంబుల కబ్బురపడి నాచిట్టికూనా! నన్ను జయించు చున్నావు. నీమనస్సట్టిపోయిన మరులుకొందువేమో యని

భయంపడితి. నీతోడిచెలులు నీకై కాచియున్నారు. వారితో నీచర్చ సాగింపుము. నాకు పనియున్నది. అని సుగుణమణి యంతర్గృహమున కరిగె. విశాలాక్షియుఁ దోడివారింగూడి క్రీడా వనంబున కరిగె.

—: వన విహారము :—

లోకమోహనమూర్తి యామె హృదయమునుండి తొలఁగకుండుటచే రెండవమనస్సు లేకుండుటచే నేకచింతనముతోఁ దదితర వ్యవహారములు మాని మౌనముద్రవహించి యుత్సాహ మాట పాటలయందు చూపకుండుట చెలులు కనిపెట్టి చెంతఁజేరి ఏమమ్మా విశాలాక్షీ ! నీవిశాలాక్షములు మఱింత విశాలములై దీర్ఘాలోచనము సేయుచున్నవి. మాపలుకులు చెవికెక్కుట లేదు. ప్రశ్నములకుత్తరమిచ్చుటలేదు. ఆటలులేవు. పాటలు లేవు. చిలుకలకు పలుకులునేర్ప నుత్సహింపవు. శారికలకు గీతములు నేర్పఁబూనవు. అవి ప్రాఁతపాఠములు వల్లించుచుండ విని యపశబ్దముల దిద్దవు. తెలిపిట్టలకు నడకలు నేర్పవు. నీవుంచిన క్రొత్తపేరు గల రాగిణి రాగమాలాపించుచున్నను తల కదల్పకున్నావు. ఎందును నీకు మనసు చొరకున్నది. కారణమేమి ? మావలన నేదేని దోసంగు పొసంగెనే ? యని యొక తోయజముఖి ప్రశ్నించె. ఇంట నేదేని వినరాని వెగటు మాట వినఁబడియెనే ? యని యొక విమలవదన యడిగె. అశ్లీలయుండు ? చూడని వింతవస్తువును చూచియుండ నగునని

నామనస్సు తెలుపుచున్నదని ప్రక్కయింటి పంకజాక్షి పలికె. నాయెదయు సత్యము సత్యమని సాక్ష్య మిచ్చుచున్న దని యొక సరసాంగి వాకొనియె. వ్యాసుఁడు దోఁచుకొని పోయిన విద్యనొక క్రొత్త వటువు వచ్చి యనుగ్రహించి పోయెనఁట! అతనిఁ గాంచినది మొద లిట్లైనదని నాకు వారి మేడమీఁదిగాలి పలుకుచుండినదని యొక చదురులాఁడి నొడివె. అవునవు నట్లే యుండనగునని వేఱొక వెన్నెలనవ్వు వన్నె లాఁడి వచించె. ఇఁక శైత్యోపచారములకుఁ గడంగుదమా యని యొక చెలి పరిహాసము కావించె. అంతకంటె మున్నుగ నీచిలుకల గోరవంకల దూరదేశములకంపి కోకిలలఁ బలుగాకుల పాలుచేసి చంద్రకందర్ప దూషణములకుఁ బూనుకొందమని యొక చతురవచన వచియించె. ఏపాపమెఱుఁగని పక్షులేమి చేసె? అనంగుఁ డేమిచేయఁగలఁడు? చందురుని దోషమేమి? మలయ పవనుని చెడుగేది? యని ప్రబంధపఠన జ్ఞానములేని పద్మగంధి పలికె. ఇట్లు పలువురు చెలులు తలకొక్కతీరున గేలిసేయ మొదలిడ విశాలాక్షి వారితోనేమియు వాదాడ నొల్లక లేచి తటాలున నెక్కడకో పోవుచు వెంబడించిన వెలందిని కన్నులతోఁగసరి రాకుమని సైఁగచేయుచు నేకాంత ముగ నొకపొదరింటఁజేరి కూర్చుండె. చెలులును దూరదూర మున నిలిచి యామె నూత్నచేష్టలను తదేకదృష్టులతోఁ గాంచుచుండిరి.

—: శివుఁడు విశాలాక్షి ననుగ్రహించుట :—

పుష్ప నికుంజమునఁ జేరిన పూఁబోఁణి యొకింత సేపు కనులుమూసి ఓమహానుభావా! ఊరుపేరు తెలియని నిన్నేల నాహృదయము వెంబడించుచున్నది? మరలఁ గానవత్తువో రావో ఊహింపఁజాలని నిన్నుతలఁచి తలఁచి చింతించి కాంచు లాభమేమి? ఊరక చెలులకడ నగడుపడుట దక్క! పరమేశ్వరా! నిష్కలంకమై యుండిన నాహృదయమున నీ కలంక మేల కలిగె? కలిగెఁబో! అణఁపరాని బలిమి నాయెద కెట్లు గలిగె? ఇఁక నాగతియేది? చెలులతోఁ జెప్పికొన్న సిగ్గులచేటు. వారెత్తిపొడుతురు. వారి తెలివి యంతియ. చిత్ర రేఖవంటి సర్వజ్ఞ చిత్రకారిణి నాకెక్కడ లభించును? ఎఱకలు కట్టుకొని యెగిరి లోకమెల్లఁజుట్టి గాలించివచ్చినను ఫలము గానని యీరిత్తకోరికవలన మనసుచెడుటతక్క ఫలంబు గానరాదు. మనసును మరలించి యణఁచుకొనుకంటె నెందును వేఱు మందు గానరాదు. అని నిశ్చయించి పరమేశ్వరధ్యాన నిమగ్నయై కొంతవడి కనులుమూసియుండ నావన్నెకాఁడగు వటుఁడట నంతర్లోచన గోచరుండయ్యె. ఆ కలికి యులికిపడి అయ్యో! మరలవచ్చితివా మనసులాగుటకని మైమఱచి వ్రాలె.

వ్రాలిన వాలుగంటిమేను ధూళిధూసరితము కానీయక యాచెలువుఁ డాయమనెత్తి తనయొడిఁ జేర్చికొని యొడలిం

దడవుచు మదీయ హృదయహారిణీ! ఏల చింతిల్లెదు? నాడెం దమును దొంగిలించి తెచ్చి యెచ్చట దాఁచితివి? ఇచ్చి దయామయివై పుణ్యముఁగట్టుకొనుమా యని యతండు దీనుండై వేఁడుచుండ నమ్ముగ్ధ యించుక కన్నులు తెఱచి కన్నులఁబడిన మనోహరుని గాంచఁజాలక మెఱువు తగిలిన తటి వలె నట్లే నేత్రములు ముకుళించె. అతఁడు మేనెల్లఁదడవుచుఁ జెమటఁదుడిచి జడుపు మాన్చి మెలమెల్లన నయనములు విచ్చునట్లుచేసె. విశాలాక్షి యించించుక కనుమోడ్పు చాలించుచు చాలింపకయు నిదికలయా? మెలఁకువయా? సత్యమా? మాయయా? ఇంద్రజాలమా? కాదుకాదు. మెలఁకువతో నున్నదాన. ఇది యుద్యానవనము. కలలోఁ గాంతారములు కల్పవనములు కానరావా? ఇదికలయే? అయిననేమి? నామనసు నాకడ నున్నది. కానవచ్చిన దైవమును కాంచి వరము లడుగకుంట బేలతనముకదా? యని తెగువ నూనె. అంతట వారి కిట్లు సంభాషణము జరగె.

మహాభాగా? మీరెవ్వరు? నీహృదయవాసిని. అగుదురుగాక. మీపేరెయ్యది? పదివేలపేరులలో నెయ్యది కోరుచుంటివి? అన్నియుఁదెలిసినఁగదా యొకటియేర్చి యడుగుట? అన్నింటి వల్లింపఁగాలము వ్యర్థమగు. అట్లయిన మిమ్మెవ్వరని నేగుర్తించుట? భవన్మనోహరుఁడని. అట్టి కొండగుఱుతు లక్కఱకు వచ్చునా? రాకున్న నీ యిష్టమువచ్చిన యభిజ్ఞ నుంచు

కొనుము. విశాలాక్షీమనోహరుఁడనన్నఁజాలు సమ్మతింతు. ఈ చదురులు గట్టిపెట్టి మీరెవ్వరో తెలుపరా? మున్నే తెలిపితిఁగదా? ఇంకను అమంకుపట్టినా? సీయొద్దఁగాక మఱేరియొద్ద నామంకుతనము చెల్లుట! అగుఁగాక! నన్నిట్టి సందిగ్ధసంకటములపాలుసేయుట మీవంటివారికర్హమగునా? ప్రియురాండ్ర యెడ నర్హమేయని తలంతు. ప్రేమకు మేరగలదా? శాసనము కలదా? పలుపలుకులేల? నేనెవ్వండనో కొలఁదికాలమున నెఱుఁగఁగలవు. నిన్ను ప్రేమించితి. నీవ నాయర్ధాంగివి. శాస్త్రవిధి నీజననీజనకుల సమ్మతిని బంధుమిత్రజన సమక్షమున నీ చెట్టఁబట్టెద. ఒక కొంతకాల మోర్చియుండుము. నన్ను చూడవలఁతేని యేకాంతమునఁ గనులు మూసికొనుము. ఇదిగో నేను వెడలుచుంటి నని యాబ్రహ్మచారి యదృశ్యుఁడయ్యె.

అంత నాకన్యారత్నంబు నిద్రనుండి మేల్కాన్న వడువున లేచి నలు వలంకులు కలయంగాంచి యెవ్వరును లేమి కాశ్చర్యపడి యతండు నిజముగ నాకడ కరుదెంచెనా? నన్ను ప్రేమతో నుత్సంగమునఁ జేర్చెనా? నాతో సంభాషించెనా? నాకు మాట యిచ్చెనా? నాయందు దయచూపెనా? ఇదియంతయు నిక్కమా? కలయా? నిద్రయే లేక కలయెట్లువచ్చు? కలవరింతయా? కావచ్చు. అయిననేమి? వలసినపుడు కనుల మూసికొమ్మనె. కలవరింత కలదానికి మరలను కానరావచ్చు. నాకేమి పిచ్చిపట్టెనా? చెలుల వీడి వచ్చితిఁగదా? వారేమి తలంతురో? అని

వడివడిలేచి పయ్యెంట సవరించుకొనుచుఁ జెలుల వెదకుచు వచ్చుచుండ నొకొక్కక రొకొక్కక పొదనుండి డాఁగుడు మూఁతలాడువారికై వడి లేచుచుండ విశాలాక్షి మిక్కిలి కలఁత నొంది నాగుబ్బల్లి వీరెటింగిరా? మంచిది. వీరే యెటింగియున్నచో నాకలవరము కలగాక నిక్కవమగునని తలపోయుచు వారిం జేరం జనుడు వారలా కలువకంటిం గౌఁగిలించి ఏమి యీపిచ్చి భ్రమ? ఎచ్చటి కేగితివి? ఏమి చేసితివి? నీ యొడ లెంత మాఱుపాటొందినది? దీని కేది మందు? వెంటనే నీతలి దండ్రులకుఁ దెలుపకున్న నేమి మూడునో యెఱుఁగఁజాలము. అనుటయు విశాలాక్షి వారల పలుకులవలన నే నిశ్చయముం జేయంజాలక తన కలవరింతకు మఱింత కళవళించుచు ఏమి కాంచితిరే యిట్లాడుటకు? ఏమి తప్పుచేసితిని? అని ప్రశ్నింపఁగా నొక్కకాంత దయ్యము సోఁకినదానివలె మౌనధారిణివై యొంటరివై పూఁబొదరింటి కేగితివి. అటనేమిచేసితివో? నీ యొడలెల్ల నలఁగినది. మోము మాఱుపాటొందినది. మగనిఁ గాంచిన పోఁడుములు నీమేనఁ గానవచ్చుచున్నవి. అనుడు నా యిందువదన యించుక కొంచుచు మీరిట్లాడఁదగునా? యన వార లిట్లేల మాటాడకుంటివో యేల యేగితివో తెలిపిన నన్నియుఁ దెల్లమగు నన నాకేమియుఁ దెలియకున్నది. ఒడల దడ పుట్టినది మాత్రమించుక తెలియవచ్చినది. అని విశాలాక్షి వచించె. వారదివిని దిగులుపడకు. పోయినది పోనిమ్ము.

చికిత్స నీకవసరము. అనుచు వనము వీడి యిరవుల కరుదెంచు వారు సుగుణమణింగాంచి అమ్మా! విశాలాక్షి యున్మత్తవలెఁ జరించినది. తగు చికిత్స యవసరమని నొడివి వెడలిరి. ఆయమ దిగులొంది యేమితల్లీ! ఏమి కాంచితివి? ఏమి జరగె? తెలిసి నంత దాఁచక తెలుపుము. అవసరమగునది కావింత మన విశాలాక్షి అమ్మా! నాకేమియు వలదు. నామనస్సు నాయధీనమందే యున్నది. మీరు దిగులుపడి నన్నగడు సేయువలదని తన గ్రంథభండారమున్న గదికేగి యొకపాత్రముం గొని చదువ మొదలిడె. తల్లియుఁ దన పనిపై నేగె.

గ్రంథము నందుకొనియెఁ గాని దానిపై మనసు నిలిచినఁగదా చదువుట! తానెత్తుకొన్నపాత్రము పేరెయ్యదియో యామె యెఱుఁగదు. ఆ పాత్ర మటనుంచి వేఱొకటి కైకొనియె. అదియు నంతే. తలఁపోకలైయుండఁ గార్యము వేఱొండు జరగునా? గ్రంథ మటనుంచె. తలుపు మూసె. ఒక వేత్రాసనమునఁ గూలఁబడి కనులు మూసె. తన యిష్టదైవమును ధ్యానించి కనులు తెఱచునంతఁ బూర్వ బ్రహ్మచారి యెదుట నిలిచియుండె. ఇది నిక్కమా! మఱి కలవరమా? మతిభ్రమముచేఁ గలిగిన మనోవికారమా? యని యోచింపసాగె. ఎదుటి వటుండు నన్ను తలంచిన కోరిక నరసితి. చింతింపకు. కలవరింపకు. తేపు తేపకడ నొకమునీంద్రుండు మీగృహమున కరుదెంచి నీతలిదండ్రుల నాకొఱకై నిన్నర్థించు.

ఓర్పు పట్టియుండు మని ధీర గంభీర స్వరమునఁబలుకుచుండు నంతఁ దలుపుదట్టు సవ్వడి యామె వీనులంబడియె. విశాలాక్షి మనసు భయమునఁ దత్తళించె. వడుగఁడు చిఱునగవునఁ దలుపు దీయుమని సంజ్ఞ గావించె. విశాలాక్షి నమస్కరించె. అతఁడు భయపడకుమని వీఁపుదట్టుచుఁ దలుపు దీసివైచె. సుగుణమణి తటాలునఁ గవాటముఁ ద్రోసికొని లోని కరుగిడె. వటువు రూప మామెకుఁ గానరాదయ్యెఁ గాని జాడ మాత్రము నీడవలెఁ దోఁచి వెలుపలికేగుచుండు పొలకువ యేర్పడియె. ఆమె గుండెలు దడదడమన నొకపెద్ద కేకవైచె. అప్పుడే వనములనుండి గేహమున కేగుదెంచిన సుధాముఁడు భార్య కేకవిని వరుగున నరుగుదెంచుచుండ నెదుటనొక మనుజచ్ఛాయ యగపడి యాట నుంచియుండిన యొక మద్య పాత్రంబున నడంగె. ఆశ్చ్వవడి యతండు కొంతవడి నిలుచుండి యవ్వల దారఁతోఁగలిసి పాత్రముకడకు నడచునంత

—: లింగోద్భవము :—

నందుండి మిఱుమిట్లు గొలుపు నొక దివ్యతేజము వెలికి వ్యాపించె. ఏమిదియని తెప్పలార్పక కాంచ నందొక్క లింగ మగపడియె. మెల్లన సమీపించి యాశంకరమూర్తిని వెలికిఁ దీయ నుద్యమించి ప్రయత్నము విఫలమైనందున నాదంపతు లాచిత్రంబు విశ్వేశ్వరలీలయని విశ్వసించి యిట్లు వినుతించిరి.



# సురాభాండేశ్వర స్తుతి.

ఓంనమః పరమార్థైక రూపాయ పరమాత్మనే
స్వేచ్ఛావభాసితా సత్య భేదభిన్నాయ శంభవే

సంసారైక నిమిత్తాయ సంసారైక విరోధినే
నమః సంసారరూపాయ నిస్సంసారాయ శంభవే

ఆసన్నాయ సుదూరాయ గుప్తాయ ప్రకటాత్మనే
సులభాయాతిదుర్గాయ నమశ్చిత్రాయ శంభవే

తారానాయక శేఖరాయ జగదాధారాయ ధారాధర
చ్ఛాయాధారక కంధరాయ గిరిజాసంగైక శృంగారిణే
నద్యాశ్శేఖరిణే దృశాతిలకినే నారాయణేనాస్త్రిణే
నాగైః కంకణినే నగేనగృహిణే నాథాయ నిత్యం నతిః

కేయూరీకృత కంకణీకృత జటాజూటావతంసీకృత
జ్యావల్లీకృత కుండలీకృత కటీసూత్రీకృ తాహీశ్వరః
పాయాద్వ స్తిలకీకృతః ప్రియతమా దర్ధీకృతాక్షీకృత
ద్యూతారంభ పణీకృతేందుశకలః కాత్యాయనీ కాముకః

నమః ప్రణవరూపాయ శుద్ధసత్త్వాయ శంభవే
జగత్సుఖ ప్రదాత్రేచ సురాభాండేశ తే నమః

నమస్త్రిలోకరక్షాయ జంగమస్థావరాత్మనే
నశాస్త్ర జితమారాయ సురాభాండేశ తే నమః

చంద్రసూర్యాగ్ని నేత్రాయ భక్త రక్షాయ తే నమః
హైమవత్యర్ధదేహాయ సురాభాండేశ తే నమః
నమ స్త్రిగుణరూపాయ గుణాతీతాయ తే నమః
సర్వలోకశరణ్యాయ సురాభాండేశ తే నమః

వందే శర్వం విభూత్యంగం విశ్వరక్షంచ శంకరం
మృత్యుంజయం విరూపాక్షం సురాభాండేశ్వరం శివం.

క॥ శ్రీ పార్వతీ మనోహర
మాపాలిటి పూర్వపుణ్య ♦ మహిమంబే యీ
రూపమునఁ దోఁచె ననఁదగి
ప్రాపయి వచ్చితివిగద ! సురాభాండేశా !

క॥ తపసులు నిష్ఠాత్మకులై
తపియింతురు నిన్నుఁగాంచ తమిగొని వారిఁ
గృపఁగాంచవు కంటిమి ని
ర్జపుల ఫలమ్మిట్టిదే ! సురాభాండేశా !

క॥ పాపాత్ముల పాపములం
బాపు దొరవు పరమపురుష భవ్యాత్మేశా !
పాపులము దీనులము మా
ప్రాపయి వచ్చితివిగద సురాభాండేశా !

క॥ లాభమున కేరు లేరు కృ
పాభయదాయివయి యడరు హాలహాల
మ్మేభయము లేక లోక
ప్రాభవమతిఁ ద్రావితివి సురాభాండేశా !

క॥ స్వసుఖములు వదలితివి లో
క సుఖమ్ములకొఱకు నీవుగా కెవరిట్లీ
వసుధ నొనరించిరి దయా
రసధామ ! సురాదినుత ! సురాభాండేశా !

క॥ చంద్రానన నార్ధగాత్రా!
చంద్రతపన వహ్నినేత్ర! సతత పవిత్రా!
చంద్రకిరణ సితకీర్తి!
చంద్రశకల శీర్షమూర్తి! సద్ధితవర్తీ!

క॥ కరుణారసభరణా! సం
సరణ శరధి తరణ! శుభద చరణా! గిరిజా
వరణా! పన్నగరాజా
భరణా! శశిధరణ! రజత పర్వతశరణా!

క॥ కుండలి మండన! మదిరా
భాండోదిత భవ్యలింగ! భవభయ భంగా!
ఖండేందుధర! కృపాకర
దండిత దుర్దైత్యవార! ధర్మవిహారా!

ఇట్లు పులకీకృతాంగులై బాష్పబిందు నిష్యందముఖులై యానందవివశులై వినుతించు నాపుణ్యదంపతుల ననుగ్రహింపం దలంపుగొని విశ్వనాథుండు చంద్రకలావతంసుండై జాహ్నవీజటాజూటుండై నాగభూషణుండై భస్మావలిప్త సర్వాంగుండై శార్దూలచర్మధారియై గజచర్మోత్తరీయుండై కానంబడి వారల నానందింపఁజేయుచు నిట్లనియె.

ఓపుణ్య దంపతులారా! మీరలు పూర్వభవంబున మేనా హిమవంతులరు. భవత్పుత్రిచేఁ బవిత్రీభూతంబైన యా

గాంగభూమి యెట్టిదో కానంగోరి యిట జనియించిన వారలు. మీముద్దు చెల్లింప వేడుకపడి పార్వతి విశాలాక్షి యనుపేర నిప్పుడును కూఁతురయ్యె. ఆమెయందెట్టి దోసంబును గలుగదు. వ్యాసుండు చేసిన మోసంబునకుఁ దగిన ఫలం బచిరకాలంబున మావలన నతం డనుభవించు. దానంజేసి మీకుఁగలిగిన లో టెయ్యదియు లేదు. మీకూఁతు కోరికమేరకు లోకధర్మంబు ననుసరించి తేవు తేవకడ మీకడకు మైత్రేయుం డరుదెంచి నాకై కన్య నర్థించు. సకలబంధు సమక్షంబున వివాహ నిశ్చ యంబు గావింపుఁడు. వరుఁడెవ్వఁడన లోకపాలక బ్రహ్మచారి యనుఁడు. ఈ నా లింగరూపంబును మీయావరణంబున నొక చోఁ బ్రతిష్ఠించి సురాభాండేశ్వరుం డని పేరిడి పూజించుచుం డుఁడు. మీకోరికలఁ దీర్చుచుండుదు. మీకు శుభంబగుతమని శంభుం డంతర్ధానంబు భజించె. వారలు మేరయిడరాని యానం దంబునఁ దమ్ము ధన్యజన్ములఁగాఁ దలంచుచుఁ దనయం జేరి గ్రుచ్చియెత్తి కవుంగిలించికొని తల్లీ ! నీజన్మంబుచే మేము మా కులము వారలు పవిత్రులమైతిమని యామె మెయిం దడవి తడవి తనివి నందిరి.

—: ఆలయ నిర్మాణము :—

ఆదినమే సుదినంబుగా భావించి యాలయనిర్మాణ విధా నంబు చర్చించి తమ యంతర్భవనంబున నొక చలువఱాతి

మండపంబును దాని ముందటిభాగంబున విశాలమగు కూటం
బును నిర్మింప సుధాముఁ డాజ్ఞాపించె. ఎనిమిది దినంబులలో
నిర్మాణకార్యము పూర్తికాఁగా వివాహ దినంబునఁ బెండ్లి
కొడుకుచేతనే లింగ ప్రతిష్ఠ చేయింప నిశ్చయించె.

—: వివాహాలంకరణము :—

శంభుఁ డంతర్ధాన మందిన మఱునాఁడు మైత్రేయుం
డరుదెంచి వీడ్కోలు వీయంబుచేసె. బంధుమిత్రులఁ గూర్చికొని సుధా
ముండు కూఁతువివాహంబు నిశ్చయించె. పెండ్లి పది దినము
లలో నున్నందునఁ గార్యంబులు వడివడిగఁ గావింపవలసె.
కలిమిగలవారి కార్యంబులు కడువడి నెగ్గుటలో వింతయేమి
కలదు ? పిలువనివారును తమంతవచ్చి పనులు కావింతురుకదా!
స్వసౌధంబులు తదావరణంబులే కాక వీథులెల్ల నలంకృతం
బులయ్యె. దేవాలయంబు లన్నియుఁ దత్తదుచితాలంకరణంబుల
శోభిల్లె. అయ్యెయెడల నానావిధ వాద్యంబులు మ్రోఁగె.
పలు వగల వేడుకలు వాడవాడల విస్తరిల్లె. అచట జనంబులు
మూఁగి నటకుల కొలంములఁ బరికించి వారికి నటశేఖర గాన
కోకిల హాస్యరత్నాకర బహువేషధురంధరేత్యాది బిరు
దంబులఁ బ్రసాదించుచుండిరి. బంధుజనంబులే కాక తదితరులు
పురవాసులును పురంధ్రీమణులును వారివారి యోగ్యతల నను
సరించి విచిత్రనూత్న వస్త్రాభరణ చందన మాల్యాదికంబుల ధరి

యించి తమయింట నుద్వాహంబు జరుగుచున్న భంగి నుత్సాహ యుతులై యొప్పారిరి. ప్రతివీథియందు నన్నదానము జరుగు చుండె. ఎల్లవారు స్వర్గసుఖంబులఁ గొల్లగొన్న తెఱంగున నుల్లసిల్లి యిటునటుఁ బనిగలవారు లేనివారు సైతము కలయఁ దిరుగుచుండిరి. వివాహవిధులకు వలయు సామగ్రితోఁ బురోహితుఁడు శిష్యవర్గముతోడ సంసిద్ధుఁడై పెండ్లిపందిట నుండె.

అట్టితఱి విశ్వనాథాలయ సమీప మండపంబునుండి పెండ్లికొడుకు తగుపరివారముతో మునివర్గంబుతో మానవ రూపంబులఁ గైకొన్న నందీశ్వర భృంగీశ్వరులతో సప్త మాతృకలతో దిక్పాలకులతో సభార్యులైన బ్రహ్మవిష్ణులతో దేవకామినీ జనంబుతో దివ్యవాద్య ఘోషంబుతో రంభాద్యప్సరః కాంతాజన నటనంబుతో మహర్షుల వేదనినాదంబులతో నీఁగ్రాలిన జాతిపడు నున్నని మెఱుఁగైన మేని నిగనిగలు గల బసవనిపై నెక్కి మెల్లమెల్లన పెండ్లినడకతో వీథులదాఁటి సాగివచ్చుచుండె. నూతనవరునిగాంచు సంబరంబునఁ బుర పురంధ్రీవారంబు తమకావించుకొనుచుండిన యలంకరణంబుల యఱిగొఱలతోఁ బరుగుపరుగునవచ్చి యావడుగని సొబగు నేత్రంబులు తనివిసనఁగాంచి ఇట్టివన్నెకాని నెందేని గంటిమే? ఇతఁడు కంతుఁడో జయంతుఁడో వసంతుఁడో నలకూబరుఁడో వారిసౌందర్యంబు లడంపఁగోరి యిట్టి లోకమోహనరూపంబు ధరించివచ్చిన వాసుదేవుండో విశ్వనాథుండో యని మెచ్చుచు

ననిమేషనయనలై కాంచుచు విఘ్నంబుసేయు తెప్పల దూషించుచు ననిమిషత్వము లేకపోయె నని విచారించుచు నొకరి భుజంబుల నొకరూని నిక్కి చూచుచు నిక్కినవారి నడఁగిన వారు నిందించుచు నిక్కఁజాలనివారు నడుముల బయలున వంగిచూచుచు నట్లును వలనుపడని కొందఱు బేలలు ముందటి వారిం ద్రోచువారు తిన్నియలెక్కువారు చిన్నగోడలపై కెగఁబ్రాఁకువారు దోరణగమ్ములఁ బట్టుకొని నిక్కువారు మిద్దెలెక్కువారు చంద్రశాలల నిలుచువారు తోడిచెలులఁ బిలుచువారు పిలిచి మన విశాలాక్షి భాగ్యమే భాగ్యము; మఱియెవ్వరు నిట్టి యదృష్టశాలినులు కారనియు ఇట్టివరుఁడు దొరకుటకు బహుజన్మ సుకృతఫలం బొక్కుమ్మడి పండవలయు ననియు ఈకొమరుఁ బ్రాయంపుఁ బెండ్లికొమరుఁ డేయూరి వాఁడో యించుక యేని యెఱుఁగరాదనియు సంబరంబుగాంచ మహావిభవ సంపన్నుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడనియుఁ బరి పరి విధంబుల వాకొనుచుండిరి.

—: లింగప్రతిష్ఠ, వివాహము :—

పెండ్లికూఁతువారు వైభవంబుతో నెదురు వచ్చిరి. వరుఁడు వధూగేహంబునఁ గుడికాలు ముందుంచి ప్రవేశించె. ఆనాఁడె సుధాముని యభీష్టంబు ననుసరించి పెండ్లికుమారుండు సురాభాండేశ్వర లింగంబును చేతులారఁ బ్రతిష్ఠించె. తక్కుం

గలవిధులు విధ్యుక్తంబుగ మునిజనంబు గావించె. తదనంతరము క్రమంబుగఁ బెండ్లిపెద్దలు విధివిధానంబుగఁ గార్యంబులు విధించుచుండ ఋషీశ్వరులు వేదోక్త గీతంబు లుగ్గడింపుచుండఁ బురోహితుఁడు వధూవరులచే సమస్తకార్యంబులు నడపె. శాల్ద్రిక్కి కన్నియ యఱుత వన్నియకాఁడు మంగళ సూత్రంబుగట్టె. పెద్దలు లాజాక్షతలు చల్లి వధూవరుల నాశీర్వదించిరి.

ఎల్లవీదులందు కొల్లగ బీదల కన్నము పెట్టఁబడియె. ఒక్కయెడఁ దాంబూలము మఱొక్కయెడ వస్త్రములు వేఱొకయెడఁ జందనమాల్యాదికము నింకొకచక్కి భూరిదక్షిణ లొసఁగఁబడుచుండె. అన్నియెడల వేడుక లైదుదినములు ప్రవర్తిల్లె. పెండ్లికి వచ్చిన యెల్లజనంబులు తారతమ్యంబులేక సమగౌరవంబున సమారాధనంబుగొని సంతృప్తులై యరిగిరి. శ్వశుర గృహంబున నల్లుఁ డిష్టోపభోగంబు లనుభవించుచు నెల దినంబులుండి యొకనాఁడు తలఁచినతఱి నరుగుదెంతునని సెల వంది యిల్లాలింగాంచి నీవు నిత్యాన్నదాన సంతోష నియత చరితవై వర్తింపుచుండుమని యాదేశించి యెటకో వెడలె. విశాలాక్షి నాఁటంగోలె స్థిరసంకల్పయై యతిథిజనంబు వసింప భుజింప ననువగు వసతుల నిర్మింపఁజేసి వచ్చువారి కేవేళయందైన లేదనక వండించి వడ్డించి సంతృప్తిపఱచి పనుచుచుండె. క్రమ క్రమమున నామెను విశాలాక్షియనుట వదలి అన్నపూర్ణ య

నుపేర జనులు పిలువసాగిరి. తలిదండ్రులు తోడిచెలులు దక్క విశాలాక్షియని పేర్కొనువారే లేరైరి.

—: కపాలిచేతి కపాలము వీడుట :—

ఇట్లు కొంతకాలము జరుగ నొక్కనాఁ డొకభిక్షుకుండు కపాలపాణియై వచ్చి వాకిట నిలిచి భిక్షాం దేహియనియె. అవ్వార్త విన్నయంతఁ దటాలునలేచి యన్నపూర్ణ పాద్యంబు గొని వడివడినేగి యతిథిపదంబులఁ గడిగి తజ్జలంబు శిరంబునఁ జల్లుకొని యతని లోనికిఁగొనియేగి యోరెంబుగొన నామతిం చుటయు నతండు వలదు వలదు; ఏను స్వయంపాకిని. ఏ గ్రొత్తడి చేతిభిక్షుచే నాయీ కపాలపాత్రం బూడిపడునో యను తదేక చింత గలవాఁడనై సక్తుప్రస్థునింటి నకులంబువలె జగమెల్లఁ ద్రిమ్మరుచుంటి ననుటయు నయ్యమ యత్యాశ్చర్యమందుచు లోనికిఁజని దోయిలినిండుగఁ దండులంబులుగొని విశ్వేశ్వర ప్రీతిరస్తని పునుక పాత్రంబునఁ బోయునంత నయ్యది చేనుండి వీడి నేలంబడి బ్రద్దలయ్యె. కాంచినవారెల్ల రాశ్చర్యంబు గాంచుచుండ నక్కపాలధారి నిజరూపంబా గరితకుఁ గానిపించె. అవ్వనితారత్నం బబ్బురపాటును భయ సంభ్రమమ్ములు ము ప్పిరఁగొన నతని పదంబుల వ్రాలి తద్రజంబు శిరంబున ధరించు నంత నప్పరమేశ్వరుం డత్తరుణిని లేవనెత్తి కౌఁగిటంజేర్చె. అందఱు లోనికేగి యుచితాసనంబులఁ గూరుచుండిరి. అల్లుని

భిక్షాపాత్ర వృత్తాంతం బత్త మామలు వినఁ గోరుటయు ము
క్కంటి యిట్లనియె.

పూర్వ మొకతఱి నేను పంచముఖుండనై పార్వతితోఁ
గూడి కైలాసశిఖరంబున నొక స్ఫటికశిలాతలంబుపై నాసీనుం
డనై షణ్ముఖుని బాల్యలీలలఁగాంచి యానందించుచుండుతఱి
మమ్ముదర్శింపఁ బరమేష్ఠి యేతెంచె. ఒకతఱి యతండు నాకుఁ
దండ్రియైన కతంబున నే మర్యాదకై యభ్యుత్థానం బొనరించి
నాలుగడుగులు చని నమస్కరింప నతండు నాయెడలిబూది
తన మేన నొత్తుగ మెత్తుకొన బిగ్గఁగవుంగిలించి పదంపడి నాచేయి
పట్టుకొని నాతోడ నరుదెంచె. ఇరువుర మొక యాసనంబుపై
నాసీనులమై లోకవ్యవహారంబుల నిష్టాగోష్ఠి నాడుకొనుచుం
టిమి. అత్తఱి నవ్వలికేగి షణ్ముఖ దంతిముఖుల క్రీడావివా
దంబు పరిష్కరించుచుండిన హైమవతి యచ్చోటికివచ్చి యచ్చె
రువున మాయిరువుర మొగములఁ గనుచు నిరువురము పంచ
ముఖులము కావున నెవ్వండు తనభర్తయని నిర్ధారించుకొనఁ
జాలక తికమకపడుచునుండుట యేనుగాంచి స్వభావ
సిద్ధంబైన తమోభావంబు వహియించి తటాలున బ్రహ్మశిరం
బొకండు త్రుంచివైచితి. వైవనయ్యది నాకరంబు వీడక యంటు
కొనియె. సర్వప్రయత్నంబుల వదలకుండుటకుఁ గతం
బు బ్రహ్మహత్యాదోషంబ యని చింతించి వేఱుమార్గంబు
గానక 'అనన్యశరణంనాస్తి త్వమేవ శరణంమమ' యని

యతనిచరణ సరసిజంబుల కడ నొఱఁగి తన్మోక్షణంబు ప్రార్థించితి. అంత నతండు కరుణాతరంగితాంతరంగుండై నన్ను లేవనెత్తి నీమనోవికారంబు నీచే నట్లుచేయించె నది నీదోసంబని తలంప. నీవు చేకొన్న గుణదోషంబ. అంగవికారంబు గలవానింగాంచి కనలక యయ్యో పాపమని కనికరించు నుచితుల నంచున నంగంబులలో నొక్కండైన హృదయమందు గలిగిన వికారంబునకుఁ గాంతాళంబునొందువాఁడు బ్రహ్మజ్ఞాన సంపన్నుండెట్లగు? మహామునులు సైతము తమ తమోవికారంబు నడంపఁజాలకకదా తపంబు శాపవ్యయంబు సేయుచు నాత్మారామ సాక్షాత్కారంబు గాంచనేరకయుఁ గాంచి నిలుకడ పఱచుకొనలేకయు జీవితకాలమెల్ల నల్లలాడుచున్నారు. నీవును తాత్కాలికమైన యుద్రేకముచే నిట్లు కావించితివి. మించినపనికిఁ జింతించి మరల నట్టిది చేయకుండుటయే సత్ఫలమగు. ఈపునుక వీడుపని నావలన నగునదికాదు. ఇదియే భిక్షాపాత్రంబుగ భువనంబునఁ దిరుగుచుఁ దిరియుచుండుము. నిష్కలంక పతివ్రతచేతిబిచ్చ మీ పునుకం బోజార్చు. ఎట్టివారికేని స్వయంకృతాపరాధ ఫలం బనుభవింపక మంత్రతంత్రంబులచేఁ దీఱునది కాదని లోకులకు స్పష్టపఱుపుము. అని యనుగ్రహించి నలువ వచ్చినత్రోవం జనియె.

నాఁటినుండి యేను కపాలపాణినై యీలోకంబునఁ గ్రుమ్మరుచుఁ బతివ్రతల భిక్ష గైకొనుచు నెందును కపాల

ముక్తిఁ గాంచనేరక చాలకాలంబు భిక్షుకుం డనుపేరఁ బ్రసిద్ధిఁ జెందుచుంటి. విశాలాక్షీ ! నేఁటికి నీవలన నట్టిలాభంబు సంభవించె. ఏను ధన్యుండ. నీవు సుకృతివి. ఇట్లే నీవు సర్వ కాలంబీ కాశీపట్టనంబున నన్నదానంబు సేయుచు నాపన్నుల యాపదలఁ బాఱఁద్రోలుచు నన్నపూర్ణ వను నామధేయంబు మఱియు సార్థకపఱచుకొనుచుండుము. నేను నీవాఁడనకదా ! నీపావనహృదయంబు దక్క నన్య నివాసంబు ప్రియతమంబు గలదే ? శారీరకముగ దూరవాసినని తలంపవలదు. నీవలనఁ గావలయు కార్యంబు లొండురెండు కలవు కావునఁ గొంత కాలంబి ట్లన్నదానంబువలన వినోదించుచుండుమని బుజ్జగించి యూరార్చి పురవైరి తిరోధానుండగుటయు నద్దేవి తలి దండ్రులు నిర్భరామోదపరవశులై తనయంగుచ్చి కవుంగిలించి కొని సురాభాండేశ్వరు నాలయంబునకుఁ గొనిపోయిరి. అటఁ బరమభక్తి మువ్వురు ప్రదక్షిణించి లోనికేఁజని శివుని విధ్యుక్త విధిని పూజించి వినుతించి యవ్వలఁ దమతమ కార్యంబుల కేగిరి.

## —: గ్రంథాలయాదిక ప్రతిష్ఠ :—

ఎడ తెగని యన్నదానంబుచే రేయుంబవలు బీదసాదలఁ దృప్తివఱచుచు సంగీతంబునంబలెఁ దానును తృప్తినొందు నన్నపూర్ణ సురాభాండేశాలయ పరిసరగేహమున నొక గ్రంథాలయము స్థాపించి యందు భరతఖండమునఁ గల

భాషలయందలి యుత్తమగ్రంథమ్ము లనేకమ్ములు తెప్పించి యుంచె. తత్పట్టనంబునఁ గల స్త్రీలును పురుషులును వచ్చి వలయుపొత్తములఁ గైకొని చదివి యానందించుచుండిరి. మఱియు నప్పుడప్పుడు గొప్పవిద్వాంసులఁ బిలిపించి యుపన్యాసము లిప్పించి సద్ధర్మవిషయములను వ్యాప్తికిఁదెచ్చి సర్వజనుల వాక్కులయందు సదా సంస్మరణీయంబుగఁ జేయించె. తాను స్వయముగఁ బ్రతి శుక్రవారము స్త్రీల సభల జరపి పతిప్రతాధర్మంబులు గృహకృత్య నిర్వాహణవిధానంబులు శిశుపోషణపద్ధతులు మఱియు గృహిణులకు వలయు నశేష ధర్మంబు లుపన్యసించుచు వనితాసేవ గావించుచు నెల్లవారి నోళ్లనాలుకయై వాలుఁగంటుల మేలుబంతియై వర్తిల్లుచుండె. వైద్యశాలయు శిశుసంరక్షణశాలయుఁ దనపేర వెలయించి యఖిలజన హృదయాలయములఁ గులదేవతాకారమ్మున నధిష్ఠించె.

—: వ్యాసుని పునరాగమనము :—

ఇట్లు కొంతకాలంబు కడవ నొకనాఁడు కృష్ణద్వైపాయనుండు వేయిమంది శిష్యులతోఁ దీర్థయాత్ర గావించుచుఁ గాశీపురి కరుదెంచి మణికర్ణికాఘట్ట సమీపస్థ మండపమ్మున విడిసి తత్తీర్థంబునఁ గ్రుంకులిడి ప్రాతఃకృత్యంబులు నిర్వర్తించి కొంతవడి యమ్మండపమ్మున శిష్యవితతికిఁ బాఠమ్ములు సెప్పి మధ్యా

హ్మామగుడు నశనార్థియై పట్టనములోని కరిగె. అందు శిష్యులు కొందఱు కొంద ఱొక్కొక్క వీదికరిగి యింటింటివాకిట నిలుచుచు భవతి భిక్షాం దేహి యని యింటి వారిం బలుకరించుచు వారిప్రత్యుత్తరము విని యవ్వలియింటి కేగుచు నిట్లంద ఱన్ని వీథులం గ్రుమ్మరి పిడికెఁడన్న మేని దొరకమి వాడిన మొగములతో నాలవజాముతఱి తమ విడిదికే తెంచి యొకరి మోమొకరు చూచుకొని పలుకరింపకయే హృదయ భావంబులం దెలిసి నేఁడెట్టిదుర్దినమో యిట్లయ్యె నేమి సేయుదము ? పూర్వ భవంబున నొకనాఁ డెవ్వరికిం బెట్టము కావలయు. అయిన నెల్లశిష్యుల కొక్కదినమే దుర్దినముగాఁ బరిణమించుట చిత్రముకదా ! ఎల్లవార మొక్కరూపమగు పాపమొక్కనాఁడే కావించియుంటిమా ? ఇయ్యది చిత్రాతిచిత్ర సంఘటనము ! అని వితర్కించుచుండునంతఁ దమ గురుండును రిక్తహస్తుండై ఖిన్నవదనుండై యేతేర వారలు చుట్టుముట్టఁగి తమకుఁ బ్రత్యక్షమైన దురదృష్ట దేవతయే దేశికునకును ప్రసన్నమయ్యెనని చింతకంటె వింత నొందుచుండ గురుండును వారిమోములంగాంచి నాకైనగతియే మీకును ప్రాప్తించెనా ? అగుఁగాక. ఇదియొక పరీక్షా సమయము. మన యింద్రియ జేతృత్వమును విశ్వనాథుండు పరీక్షించుచున్నాఁడు. కలఁతలేని మొదలతో నేఁటిపరీక్షలోఁ దేఱుఁడు. సుఖదుఃఖములందు సమబుద్ధి సాధుధర్మంబనుట నేఁడుకదా నిర్ణయింప వలనయ్యె.

ఇది గొప్పపండుగుదినముగా భావించి మీమీ కార్యంబులం దప్రమత్తులరై ప్రవర్తింపుఁడని యాదేశించి యా దేశికుండు పవిత్ర గంగాజలంబులఁ గడుపారఁ గ్రోలి మణికుండ మండ పంబుచేరి మాపటివేళ నంతేవాసులతో నధ్యయన సంథ గావించి రేయి తొలిజాము తుదిని విశ్వనాథు నాలయమ్మున కేగి యందు జరగు వేదపారాయణము విని యానందించి సర్వేశున కగు నభిషేకంబుగాంచి పూజాదికంబు నరసి నివేది తాన్న మతిథుల కిడక స్వగృహంబులకుఁ గొనిపోవఁ బాలు పోవక వాదులాడు పూజరుల స్వార్థపరత్వమునకు లోన నొచ్చుకొనుచు మరలి తసయిరవున కరుదెంచి యొక శిలా ఫలకంబుపై శిష్యు లేర్పఱచిన దర్భప్రస్తరమున శయనించి నిద్రించి నాలవజామున మేలుకాంచి ప్రభాతగీతంబు పఠి యించుచు సమాహితుడై జాహ్నవి కేగి యఘమర్షణ స్నాన మాచరించి సంధ్యావందనంబు నిష్టదేవతాధ్యానంబు కావించి యమునన కర్షృంబొసంగి మరలి మండపంబుచేరి యెప్పటి యట్ల మధ్యాహ్నమగుదనుకఁ బరితలకుఁ బాఠములుసెప్పి తొలినాఁటివలెనే భిక్షకు బయలుదేఱి యింటింటికడ నిలిచి

—: మఱునాటిభిక్ష :—

యన్నమర్థింప నాచిత్ర మేమందుము ! ఒక్కతె కొంతతాళి రమ్మనియె. వేఱొకర్తు స్నానము చేయుచుంటి ననియె.

మఱొకర్తుక మైలతో నుంటిననియె. ఇంకొకత పూజవేళ యనియె. మఱియొకతి పతిశుశ్రూషచేయుచుంటి ననియె. ఒకరామ యిది వేళగాదనియె. ఒకలేమ వినియు మాఱు పలుకకుండె. ఒకచామ తొందరపనియున్న దావలియింటికేగు మనియె. ఒకభామ వేళమించిన దనియె. మీకు వేళపాళ లేదని యొక చెలువ సింగళించుకొనియె. జంగము బిడ్డలఁ గనుట యూరివారి పాపముపోసికొనుటకే యని యొక తెఱవ యనియె. పోతరించిన బసవనివలె నున్నావే? కష్టించి పనిచేసి పొట్టపోసికొనరాదా? యనియొక టెక్కులాఁడి కసరె. మా యింటఁ బనిసేయుదువా? అన్నముపెట్టెద నని యొక దయావతి పలికె. ఆప్రక్కవీథిలో అన్నపూర్ణ అతిథులకు లేదనక అన్నము పెట్టుచున్నది. అచటికిఁ బొమ్మని యొక ధర్మాత్మురాలు దారిచూపె. కష్టకాల మిదియని యొక తెఱవయనియె. అత్త యనుగ్రహించిన చాలీచాలని కొలతబత్తెము దిను చుంటిమని యొక క్రొత్తకోడలనియె. ఈబిచ్చగాండ్ర పోరు పడలేమమ్మా యనియొక్క శ్యామాంగిపలికె. ఇఁక ఊరు విడిచి వలసతీయవలసినదే యని కాయగంటి కామాక్షి మొగము చిట్లించుచు నుడివె. వీరికి వేఱుపని కానమని కుంటుచున్న హంసయాన వాక్రుచ్చె. ఒకసారి పొమ్మన్న పోరుగదాయని యూఁచతల నీలవేణి కసరె. ఏఏఏమయ్యా ఒఒఒకసాసారి చెచెచెచెప్పిన చెచెచ్చెవులు వినఁబడవా యని

న త్తినోటి కీరవాణి వదరె.

ఇట్లు పలువురు పలువిధములఁ బలుకు పలుకులు గురుండును శిష్యులును విని విసుగుచెంది మరలి మణికర్ణికా మండపమ్ముఁజేరి మునుపటినాఁటివలెనే యొకరిమొగ మొకరు చూచుకొని చూపులచేతనే విషయ మూహించి వేఁడి నిట్టూర్పులు పుచ్చిరి. అత్తఱి గురుండు శిష్యులం గాంచి యిట్లనియె.

ఇది యొక గొప్ప పరీక్షా సమయము. విసుగువేసట నొందకుఁడు. పరమేశ్వరుండు మన మనఃస్థితిని కనుఁగొన నిట్లుచేయుచున్నాఁడు. స్థిరచిత్తులు కండు. పవిత్ర వాహినీ జలములఁ దనివితీఱఁ బానముచేసి రండు. పెద్దలు శ్రవణా మృతంబు దొరకని తరుణమంద తమ్ముఁబాధించు జఠరాగ్నికిన్ని సమిధలు వేయుచుందురు. పొండు. జలములు గ్రోలిరండు. అమృత మొసఁగెద నని వచించునంతఁ జేయునదిలేక శిష్యు లెల్లరు భాగీరథికేగి తృప్తిగ నీరాని క్రమ్మఱిరి.

—: సంకల్పశక్తి :—

అంత వ్యాసుం డిట్లుపన్యసించె. సంకల్ప ముదయించినంత విరాట్పురుషునుండి చతుర్ముఖుఁ డుదయించె. అతండును తలఁపు చేతనే యీజగముల సృజించె. ప్రాణులును తలఁపులతోడనే

సమస్త వ్యవహారములు నడపుచున్నవి. తలంపులచేతనే జగము సృష్టింపఁబడినది. తలంపులతోడనే వర్ధిల్లుచున్నది. తలంపులతోడనే నాశిలుచున్నది. తలఁపులు వృద్ధియైనకొలఁది నవయువ సంచయము వృద్ధి కాఁజొచ్చె. తలఁపులవలననే తలంపులకొఱకే యీప్రకృతి యిన్నివిధముల నభివర్ధిల్లినది. తలఁపుల మీయధీనమున నుంచుకొన్నచోఁ దనువు మీయధీనమున నుండును. తను వధీనమగుటయన నేమి? ఇంద్రియ విజేతృత్వమే! అది కలవాని కాఁకలి రమ్మన్న వచ్చును. పొమ్మన్నఁ బోవును. అట్లు కాకున్న వత్సరములకొలఁది మహర్షు లన్నపానీయములు మాని యుచ్ఛ్వాస నిశ్వాసమ్ములు బిగించి తపంబు కావింపఁ దరమగునా? ఈ యాఁకలినే జయింపలేకున్నచో మఱి దేనిని మీరు జయింపఁగలరు? ధ్యాన నిమగ్నులు కండు. ప్రియతమ వస్తువుపై మనసు నిల్పుఁడు. నిలిపితిరేని యలవికాని దేదియుఁ బ్రపంచమున లేదు. అల్పాత్యల్పమగు నీయాఁకలి యన నెంత? స్థిరచిత్తులరై బాహ్యదృష్టి నరికట్టుఁడు. అంతర్దృష్టితోఁ నాత్మారాము నాలోకింపుఁడు. ఆఁకలి దప్పుల జయింపుఁడు, ఆత్మసాక్షాత్కారమున నానందింపుఁడు.

అని యుపన్యసింప నంతేవాసులెల్ల రానంద పులకిత దేహులై తమతమస్థానములఁ గూర్చుండి భ్రూమధ్యమున దృష్టి నుంచి ధ్యాన నిమగ్నులై యా రేయి యమందానంద లీలఁ గడ

పిరి. మఱునాఁడు వేకువను స్వర్ణదీ స్నానమాచరించి ప్రాతః కృత్యంబులు నెఱవేర్చి మండపంబుచేరి తమతమ పాఠంబులు వల్లించి భోజనవేళకు భిక్షుకై బయలుదేఱిరి. నాఁడు నంతే. నాలవజాము నారంభమున నెప్పటికాపుచేరి తూలుచు సోలుచుఁ గూలఁబడిరి. వారియట్ల వారి గురుండును వచ్చి నిట్టూరువు పుచ్చి శిష్యుల మొగములఁ బరికించి ఔరా! ఒట్టుపెట్టినట్లు లోకమంతటనైనఁ గమికెడన్నంబు దొరకమి కడుంగడు వింత యగుచున్నది. కారణమేమైయుండును? ప్రాచీనకర్మ ఫల మందమా? అట్టిది తలఁపునకు రాకయున్నది. అని దీర్ఘముగ నాలోచించి ఆఁ! స్మరణకు వచ్చె. ప్రియశిష్యులారా! వినుఁడు.

—: పూర్వవృత్తాంత స్మరణము :—

తొల్లి యొకతఱిఁ గొందఱు మునుల యుద్బోధంబున ఏయ్యెడ కేనేగుదెంచి సుధాముఁడను నొక గొండ్లకుల సంపన్ను నాశ్రయించి తత్కులానుగతమగు విద్యను గ్రహించి యతనికి నేకచేసితి. ఉపదేశించునెడ శిష్యభావము నాయెడఁ జూపవల వని నియమము నాచేఁ జేయించికొని బోధింపఁగా నట్టి గురు వాక్య ముల్లంఘించి యతండు నన్ను వెదకుచు వచ్చుట యొఱిఁ మట్టియూడల డాఁగి తాను సమీపించునంత గురుదేవా! నమస్కారమని కేలుదోయి మోడ్చి దేశికు నాజ్ఞ నుల్లంఘించి ందున నాతం డించుక కినిసి తిండి నీరులేక కొంతకాల మల్లా

డుదువుగాక యని పలికె. తత్ఫలం బిప్పుడనుభవించుచున్నాఁడ. ఇనుమును గూడిన యగ్గికి సమ్మెట పెట్లవలె నన్ను గూడిన మీకును నాపాపఫలంబు పంపకంబయ్యె ననుటయు నెవ్వరికేని చేఁజేతఁ జేసికొన్న ఫలంబనుభవింపక తీఱదుగదా! యని యంతేవాసు లచ్చెరువంది నాఁడును ధ్యానసమాధి నిమగ్నులై యాఁకలి నెఱుఁగకుండిరి.

## —: కాశీ మరణ ఫలము :—

మఱునాఁ డెప్పటియట్ల వేకువను మేలుకని స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చి మండపంబు చేరినయంత శిష్య వర్గంబు గురువరు సన్నిధిం జేరి భగవానుఁడా! ఇట్టితఱి నీపట్ట నంబు వదలక పస్తులుపడి కుందుచుండు టేల? చల్లనివేళ కడ వకమున్న వేఱుచోటికేగుట యుత్తమపక్షంబు కదా! యనుడు గురుం డిట్లను. సచ్ఛాత్రులారా! మహారణ్యగుహల డాఁగినను రావలసినవి రాకమానవు. అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ మ్మని పెద్దలు వచింతురు. శ్రీకృష్ణునితోఁ గూడి యాడుచుండినను గోపబాలకుల కెక్కువ లభింపదయ్యె. అయ్యది వినుండు.

శ్రీకృష్ణుండు బాలకుండై వత్సంబుల మేపుతఱిఁ దోడి గోపబాలురందఱు తాము తెచ్చుకొన్న యన్నపుమూటల నెల్ల విప్పి యొక్క కుప్పగఁ బోసి కలిపి బంతులుదీరి కూర్చుండఁగాఁ

బంచువాఁడు కృష్ణుండై కలిపినయన్నంబు తగు ముద్దలుగాఁ జేసి యొక్కొక్కని చేతికి వినరి వైవఁగా వానివాని చేతఁబడిన ముద్దను చూడఁగా వాఁడు వాఁ డింటినుండి తెచ్చుకొన్న దే యైయుండెనఁట! చూచితిరా చిత్రము! చేసికొన్నది యనుభవింపక తీఱదు. ఏనీచోటు వదలిరాను. స్వయంకృతాపరాధ ఫలం బిచ్చుటనే యనుభవించి విశ్వేశ్వరు మెప్పొంద నిశ్చయించితి. ఎంతకాలమైన సరే. ఇందే వస్తులుపడి మరణమైనఁ బ్రీతితో నొందఁ దీర్మానించుకొంటి. కాశీ మరణంబు ఘనులకే గలుగునంద్రు. ఇందు మరణించినవా రెట్టి పాపులేని శివసాయుజ్యము నందుదురు. ఆసన్న మరణులగువారి కిందిందు ధరుండు చెవిలోఁ దారకమంత్ర ముపదేశించు. మహాపాపుల కిందు మరణంబు దుర్లభంబు. ఇందుల కొక్క యితిహాసంబు గలదు. సావధానచిత్తులరై వినుండు.

—: శూద్రక వృత్తాంతము :—

పూర్వము శూద్రకుండను ప్రభుఁడొకండు వారాణసీ మరణ ఫలంబువిని యత్యంతాసక్తిమెయి రాజభోగంబులఁ బరిత్యజించి మాళవంబు వీడి యానందకాననంబుచేరి యందొక కొన్ని దినంబులుండి యొక్కనాఁడు లోలోన వితర్కించి మదీయ పాపఫలంబువలన మరణ మాసన్నమగుతఱి నితరచింతలు వొడమి యెటకే నరుగవలసి వచ్చునకా శంకించి మోఁకాలి చిప్ప లూడఁదీయించుకొని తృప్తుండై యిఁకనెట్టి కారణమేర్ప

డిన నెచ్చటికిం బోవఁజాలఁగదా యని నిశ్చయించి కాలంబు పుచ్చుచుండె. కొంతకాలంబు కడచు పదపడి యొకతరుణంబున యవన దేశంబునుండి యాశ్వవర్తకుం డొకండు సకల శుభలక్షణంబులు గల హయంబు నొకదానిం గొనితెచ్చి కాశీరాజునకుఁ గానుకగా నొసంగి యియ్యది తమబోఁటి యుత్తమరాజన్యులకడ నుండఁదగినది యని వచించి మూల్యముకంటె నెక్కుడుగ బహుమతులంది యుజ్జయిని కరిగె. ఆవలఁ గాశీశుఁ డొక్కనాఁడా యశ్వంబు నధిరోహింపనెంచి సమీపింపఁగా నయ్యది యంకెకురాక మంకుతనము చేసె. ప్రభువెంతో యత్నించియు విఫల మనోరథుఁడై మరలి కొలువుచేరి యందలి సభ్యులంగని యీక్రొత్త యశ్వంబు నెవ్వండే నధిరోహించి స్వాధీనపఱచికొని చక్కనిశిక్ష యొసంగువానికి వేయి దీనారములు బహుమతి యనియె. అశ్వారోహక కుశలు లెందఱో వచ్చి యత్నించిరి. ఆ తురంగరాజము కొందఱ సకిలింతలతోనే విఫలయత్నులఁ జేసె. కొందఱఁ జరణప్రఘాతంబుల నంతకాంతికంబున కనిపె. కొందఱఁ గఱచి తఱిమె. కొందఱ సిగఁబట్టి యూఁచి విసరివైచె. తక్కినవా రదిగాంచి యిది యముని వాహనమో యముని యవతారమో కావలయు. ప్రాణములపైఁ దీపిగలవారు సమీపింపరాదని తొలఁగిరి. గుఱ్ఱపు దుండగంబు లూరెల్లఁ బ్రాఁకె. ఎల్లవారలా వారువంబు నేరుపును పదియంతలు నూఱంతలుగా వర్ణించి పలుకసాగిరి.

అవ్వార్త శూద్రకుండు విని మనంబున నశ్వారోహణ కుతూహల మగ్గలింపఁ దన సేవకులఁ బిలిచి తన్నందలంబునఁ గాశిరాజుకడకుఁ గొంపొండనియె. వారలట్లు కావించి తమ రాజు పూర్వోత్తర చరిత్రంబులు పూర్తిగఁ దత్ప్రభున కెఱుక పఱచిరి. అన్నరేంద్రుండు శూద్రకు సమీపించి యుచిత మర్యాదలుచేసి రాజర్షీ! ఎట్లాహాయంబు నారోహింపఁగలవని ప్రశ్నించె. కట్టిన కట్టులలో గుఱ్ఱమున్నపుడే నన్ను కూర్చుండఁ జేసి యావల దాని బంధంబుల వదలింపుఁడని శూద్రకుండనియె. అతఁడట్లే కావించి తురంగమమును విడిచిపుచ్చె. అయ్యాది యారోహకుం బడఁద్రోయ విచిత్రగతులఁ దిరిగి గంతులు వైచి యతండు పడమి కచ్చెరువడి వాయువేగంబుతోఁ బురంబు నిర్గమించి యడవులంబడిఁ గొనిపోయి యొకచో నొక మహావృక్షంబుక్రిందఁదూఱె. అందు ప్రక్కకుఁ బెరిఁగి లావైన యొక కొమ్మకుఁ దగిలి శూద్రకుని తల బ్రద్దలు కాఁగా నతఁ డచ్చటనే మరణంబు నొందె. శూద్రకుఁడు కోరిన దెయ్యది? జరిగిన దెయ్యది? ఏతత్ క్షేత్ర మరణంబు కడుంగడు దుర్లభంబని మున్నే వచించితిఁగదా? నేనిచ్చోటు వదలి కదలను. మీరలితర స్థలంబులకరిగి యిప్పటికి మదీయ సహవాసంబున నైన బాధవలనఁ దలఁగుఁడు. పొండు. ఆయువున్న వారుఁ డనుగ్రహించిన మరలఁ గలిసికొందము.

అని వ్యాసుఁ డాదేశింప నంతేవాసులు పెక్కండ్రొక్కమా

టగా గురుదేవా! మీశిష్యులమైన మాకింత మేనితీపి యుండఁ దగునా? ఎట్టిదైనను తమతోఁడిదే మాప్రపంచము. మీరులేని స్వర్గమైన మాకేల? మీకైన యది మాకును కానిండు. సుఖమువేళఁ జొక్కి యాపదవేళ వదలిపోవువా రెట్టివారు? చెఱువున జలమున్న తఱి వసించి క్షీణతవహింప వదలిచను పక్షిగణము వలెఁ గాక యందయుండి క్షీణించు జలజంబులవంటివారే కదా శ్లాఘనీయులు! అనిరి. పైల సుమంత జైమిని వైశంపాయనాదు లది సమంజసమనఁ దక్కిన శిష్యవర్గ మదియ మాకును సముచిత మార్గంబని యేకకంఠులై పలికి యందే నిలిచిరి.

## —: వ్యాసుని కోపము :—

తొమ్మిదిదినము లట్లట్లు దీర్ఘదీర్ఘములై కడచె. పదియవనాఁ డెప్పటియట్ల శిష్యులతోఁ బారాశర్యుండు భిక్షకై వెడలె. నాఁడును పిడికెఁడన్నము లభింపలేదు. వ్యాసుఁడు శిష్యులమోములఁ గాంచెను. వారి కళాహీనత గుంటకన్నులు ఎండిన పెదవులు తూలిపాటు హీనస్వరము నతని దార్ఢ్యమును పటాపంచలు గావించెను. బడబాగ్ని వడువున జఠరాగ్ని తెఱఁగున నతని మనస్సు మండఁజొచ్చె. మనసులోని మంటయే కన్నుల నుండి చిటపటమను ధ్వనులతో మిడుఁగుఱులుగా వెలికుఱికె. చేనున్న భిక్షాపాత్రమును నడువీథిఁ బగుల నడిచె. ఈపురవాసులమిత సంపన్నాంధులు క్రూరులు యుక్తాయుక్త పరిజ్ఞానహీనులు. వీరిగర్వంబుతోడ నీపురంబును బూదిగావించి గంగ

లోఁ గలుపువాఁడ నని కాలసర్పమువలె బుసకొట్టుచుఁ గాలాగ్నికరణి రేఁగి కాఱులాడ మొదలిడ నట్టియెడ నతనికడకొక వృద్ధసువాసిని యరుదెంచి శాంతింపుమని చేయెత్తి సైఁగ చేయుచు సమీపించి యిట్లనియె.

—: అన్నపూర్ణ వ్యాసుని భుజింప రమ్మనుట :—

ఓయీ తపస్వీ! నీకింత కోపంబు తగునే? మిక్కిలి యాఁకలిగొని యెవ్వరును పిడికెఁ డన్నమిడకుండిరను కినుకతో నేమేమో వదరుచున్నాఁడవు. మునులకుండఁదగిన శమదమాది సుగుణంబు లివియా? ఎవరో కొందఱు అన్నమిడని కారణంబున నూరెల్ల మదాంధులని పలుక సాహసించితివా? నీచదివిన ఫల మిట్టిదియే? ఇట్టి మహాకోపివి శిష్యులకెట్లు పాఠములు చెప్పు దువో? నీయొద్ద శిక్షనొందిన శిష్యకోటి మఱెన్నిమడుఁగులు కోపవృద్ధికలదియగునో? తపఃఫలంబు గృహస్థుల బెదరించి శాపములిచ్చుకొఱకే కదా యనుకొంటివా? మంత్రంబులకు మామిడికాయలు రాలునా? ఈయూర మహాత్ముల మన్నించి యన్నంబిడువారు లేనేలేరని తీర్మానించితివా? ఊరెల్లఁ దిరిగి చూచి యిది దరిద్రపురంబని ధనమదాంధుల నిలయమని నిశ్చ యించితివా? లోభుల నెలవని తలంచితివా? అడవులఁజేరి యందు రాలిన గింజల నేఱి తిని ప్రశాంతముగఁ గాలము గడపు వారు వట్టితిక్కలని తలంచితే? మహాత్ములు కష్టసుఖములందు సమచిత్తులనుట మాటలలో మాత్ర మగునా? విశే

షించి యాకొన్నందున నకనకంపడి కినుక వహించియున్న నిన్నితఱి హెచ్చుగఁ గుందుపఱచుట మముబోఁటి యిల్లాండ్రకు పాటిగాదు. నేఁడు మాయింటఁ గుడువ విచ్చేయుము. భోజనమైన పిమ్మట నెమ్మదిగ నెంతతడవైన మాటాడు కొందము. నాభర్త మాధ్యాహ్నికము నెఱవేర్చి యతిథులకై యెదురుచూచుచున్నాఁడు. ఒంటరిగా నతఁడెన్నఁడు నారగింపఁడు. ముదుసలి కావునఁ జాలసేపోర్వలేఁడు. ఇప్పటికే ప్రొద్దు తిరిగియున్నది. ఆలసింపక నావెంటరమ్ము. అనుడు వ్యాసుఁడు సంతోషపరవశుఁడై తల్లీ! ఇంతకు మున్నెన్నఁడు నిన్నుచూచి యెఱుఁగను. నీయమానుష తేజోవిశేషంబు గాంచ మనుష్యకాంతవలెఁ గన్పట్టవు. ఆనందకాననముం గాంచు వేడుకతో దిగివచ్చిన గంధర్వభామినివో! గంగా ప్రవంతి మునుంగవచ్చిన దేవ వనితవో! నగరాజకుమారిని సేవింపవచ్చిన నాగకామినివో! కాక నాయదృష్టదేవతవో! నన్ననుగ్రహింప వచ్చిన యన్నపూర్ణవో! తెలియఁగోరెద ననుటయు నాముదుసలి, విప్రుఁడా! ఇప్పుడాప్రశ్నంబులేల? చాల యాఁకలితో నున్నాఁడవు. ప్రొద్దుమీఱె. భోజనానంతర మంతయుఁ దెలిపెద రమ్మన నతండు తల్లీ! అట్లేకానిమ్ము. ఒక్కవిన్నపము మాత్ర మవధరింపవేఁడెద. నాతోడ వేయి మంది శిష్యులున్నారు. వారును నావలె నిందు పదిదినములు పస్తులుపడి ప్రాణముల బిగఁబట్టియున్నారు. వారిని వదలి నేను

మాత్ర మేకరణిఁ గడుపార నారగింతు ? అనిన నాముది మాదిత చిఱునవ్వున నర్లేని యందఱఁ దోడ్కొని రమ్ము. విశ్వనాథుని కృపచే మాకుఁగొదువలేదు. పదివేలమంది వచ్చినను కామ ధేనువుం బనిగొన్నయట్లు వలసిన పదార్థములతో వలసినంత పెట్టఁగలను. ఆలసింపక తోడితెమ్మన నతఁడు సంతసించి తన కొఱ కెదురుచూచుచు మణికర్ణికా మండపమున నున్న శిష్యు లనెల్లరఁ దోడ్కొని రాఁగా నావృద్ధాంగన వారినందఱఁగొని పోయి బంతులుదీర్చి కూర్చుండఁబెట్టెను. చెలువలు పలువురు

—: అన్నపూర్ణ సంతర్పణము :—

పరుగు పరుగునఁ దిరుగుచుఁ బనులుసేసిరి. ఒకకొందఱు బంగరు టరటియాకులు పఱచిరి. వేఱొకకొందఱు హేమపాత్రంబుల నీరుంచిరి. ఒక్కొక్క వస్తువును పలుగుంద్రు తెచ్చి చెరచెర వడ్డన సాగించిరి. మల్లెపూలవంటి తెల్లని సన్నని వరిబియ్యపు టన్నము పిండివంటలు వివిధములగు శాకములు పులుసులు కలుసుగూరలు వడలు వరుగులు పాయసము అప్పడములు గడ్డ పెరుఁగు మొదలగు నన్నిపదార్థములు విస్తళ్ల నిండినవి. గేస్తు ముదుసలి నీర్కావిదోవతి నాభికిఁబై భాగమునఁ గట్టి నీరా ర్చిన యెఱ్ఱని వెంట్రుకల జడ ముడివైచికొని యొడలినిండుగ విభూతినలమి రుద్రాక్షపోఁగులు చెవుల వ్రేలుచుండ శివదీక్షు రూపొందిన యందమున శాంతమే పురుషరూపము వహించిన కరణి బంతుల నడిమికేతెంచి శ్రద్ధాభక్తులతో నాసంయమి

ప్రవరుల కాపోశన మొసఁగెను. తనధర్మపత్ని తాలవృంతంబు చేఁబూని విసరుచుండ నావృద్ధగృహస్థు వారిబంతిన కూరుచుండి భుజియించె. మునులందఱును కూరల చవులఁ గొనియాడుచు భక్ష్యంబుల రుచుల వర్ణించుచు పానీయంబుల పేరులడిగి తెలిసి యానందించుచు నడుమ నడుమ నూరుఁబిండ్లఁ జవులూరఁ జప్ప రించుచుఁ గోరికదీర నారగించిరి. అట్లుపారాశరులంద ఱుప వాసముచే వీఁపులకంటుకొనిపోయిన పొట్టలు బరులతోడ నుబ్బ నాకంఠముమెక్క త్రేఁపుచు లేచి కాలుసేతులు కడుగుకొన్న తరువాత నరఁటి మామిడి పనస యను ముత్తెఱంగుల ఫల ముల నొసఁగ భుజించి యాస్థానమండపమ్మున నందఱు కూర్చుండిరి.

—: అన్నపూర్ణ మందలింపు :—

అందఱు సుఖాసీనులైన యనంతర మావృద్ధగృహస్థుఁడు భార్యమోముగాంచి వ్యాసునితో నప్పుడు మాటాడఁదలఁచిన దిప్పుడాడుమని సన్నచేసెను. అంత నావృద్ధవనిత బాదరాయణు వలనువీక్షించి మునివర్యా! వంటకములు రుచిగనుండినవా? మోమోటలేక యందఱు తృప్తిగ నారగించిరా? భుజింపరాక తక్కినవారు మీలో నెవరేని కలరా? అనుటయు వ్యాసుఁడు తల్లీ! పొరపాటునఁ దప్పినవారు మాలో నెవ్వరును లేరు. అందఱము షడ్రసోపేతమైన యన్నము భుజించితిమి. ఇట్టి వంటకములు మేమెన్నఁడును చవిచూచియు నెఱుఁగము. పది

దినములు పస్తుండిరెండిన మానాలుకలు కడుపులు నతి వేలం బగు తృప్తివహించినవి. మీరుచూపిన యాదరణ మాజన్మాంతము మఱవరానిది. మీయపారదయ నెంతని కొనియాడఁ గలము? పదినాళ్లు మీరు కానరానికతము మేముపస్తుండవలసిన నిమిత్తము మదీయ పాపఫలమే యని యరసితి. మీరెవ్వరో యిప్పుడేని తెలుపవలతు. నాకుంజూడ నీవన్నపూర్ణయను పేరందిన విశాలాక్షియు నీతఁడువిశ్వనాథుఁడు ననితోఁచెడు నని పలికిన నమ్మూర్తోయలి యిట్లనియె.

ఓయీ! వ్యాసమహర్షీ! నీపాపఫలము నీవు గుర్తింపఁ గలుగుట భావి శుభావహము. నీవు స్వార్థపరులును సర్వదా కృతఘ్నులు నగువారి యంశమున జనించియు క్షేత్రమహిమ నించించుక కృతజ్ఞతాగుణము గలిగియున్నందులకు సంతసించుచుంటిమి. సదా పరాన్నభుక్కులగు మీకింత యహంభావమేల? ఒకవేళ భిక్షాన్నము లభింపకున్నంత మాత్రాన నూరిపైఁ గోపించి యూరివారి నందఱఁ దూర్పాఱఁబట్టి తిట్ట సాహసించితివే! నీయోర్పు నెంతని వినుతింపనగు? శిష్యులకుపదేశించిన యదన నుండిన పరిశీలనబుద్ధి యోరిమి మఱచెనమే యెట మటు మాయమయ్యె? నీయది పరోపదేశ పాండిత్యమే యని యిపుడేని యొప్పుకొందువా? దురభిమానము వదలక తప్పుగాదని సమర్థింపఁబూనుదువా? ఇంత మాత్రపు టోరిమిలేనివాఁడవు వేదములనెట్లు విభజించితివి?

పదునెనిమిది పురాణములకుఁ గర్తవెట్లయితివి? పంచమ వేదము నెట్లు రచించితివి? ఋషివని పేరెట్లొందితివి? క్రోధ మధిక ముగఁ గలవాఁడే ఋషికాఁదగువాఁడను రహస్య నియమ మేదేనికలదా? తపమునకు ఫలము క్రోధమే యని తలఁచి తివా? క్రోధమువహించిన కౌశికుఁడేమయ్యె నెఱుఁగవా? నీకిట్టి పరుషబుద్ధి తల్లివంక వచ్చెనా? తండ్రివంక వచ్చెనా? పుణ్యరాశియగు కాశిపైఁగోపించుట విశ్వేశుపైఁ గోపించుట యని యెఱుఁగ వైతివా? పేదలపాలి పెన్నిధియగు సుధాము నకుఁజేసిన ద్రోహమునకు ఫలంబిది యని యెఱిఁగియు దాని బయలుబ్బనీక దాఁచుకొని పురవాసులపైఁ గినుక వహింపఁ బూనిన పండితంమన్యుఁడవగు నీకింత చెప్పవలసె. ఎవ్వఁడీ పుణ్య భూమిపైఁ గోపంబు వహించు నాతండు రుద్రపిశాచమగునని యెఱుంగవా? యని యిట్లు కసరి యమ్ముత్తో ముదిభర్తవంకఁ జూచె. ఆతండును నీవు వ్యాసునకుఁ దగినట్లు బుద్ధిచెప్పితి వని మెచ్చి పెక్కుమాటలేల? ఇతఁడు కాశిలో వసింపఁదగఁడు. ఇటనుండి వెడలిపొమ్మనుము. క్రోధనిలయుఁడెక్కడ? శాంతికి ముక్తికి నిలయమగు కాశియెక్కడ? అని యతండు పరుష వాక్కులఁ దన్నధిక్షేపించి పలుక నతని దివ్యతేజము నించుక నిదానించి పరికించి వ్యాసుండు వీరలు పార్వతీ పరమేశ్వరులుగా కన్యులు గారని నిశ్చయించి యొడలు వడఁకనాయపచారంబుల మన్నింపుఁడని సాష్టాంగపడిలేచి కేలుమోడ్చి శిరంబుపయిం

గీలించి యిట్లనియె.

జగత్పితరులారా! తనయుల తప్పులను తలిదండ్రులే మన్నించి దిద్దకున్న మఱి దిక్కెవ్వరు? స్వయంకృత దోషంబుల ఫలం బనుభవించితి. బుద్ధివచ్చె. సర్వజగంబు మీనిలయంబు. అఖిల ప్రాణులు మీప్రజలు. అది యెఱింగి యన్యోన్య పీడ నంబు మాని ప్రేమచూపువాఁడు మీదయకుఁ బాత్రుఁడగు చున్నాఁడు. వేయిశాస్త్రము లేకరువుపెట్టి వల్లించినను ప్రవర్తన మందు లేకున్నఁ బ్రయోజనంబులేదు. చక్కనిత్రోవను నన్ను మందలించితిరి. కటాక్షింపుఁడు. మీరు నాయెడఁజూపినయది యనుగ్రహంబ కాని నిగ్రహంబుకాదు. మీయనుగ్రహ మిట్లు నాపైఁ బ్రసరించిన పిదపను మలీమస మనస్కుఁడ నగుదునా? యని ప్రార్థించుచుండునంత నావృద్ధదంపతుల యనుమతిని వెనుకనుండిన సుగుణమణి సుధాము లయ్యెడ కరు దెంచిరి. వ్యాసుండు వారింగాంచి సిగ్గునఁ దలవంచి యన్నింటి కియ్యది యొక్కటే యుత్తరంబగుఁగాక యని యయ్యిరువుర చరణ కమలంబులకు శిరంబు సోక మ్రొక్కి లేచి కరంబులు ముకుళించి చేసిన దోసంబునకుఁ దగిన ఫలం బనుభవించితి. మన్నింపుఁ డనుగ్రహింపుఁడని యర్థింప వారలాతని నూరార్చి మించినదానికి వగచి ఫలంబులేదు. తెలిసియో తెలియకయో కావించిన కార్యంబుల ఫలం బనుభవింపక తీఱదు. జగంబునఁ గవులకు మార్గదర్శకుండవైనయట్లుత్తములకు నాదర్శకుఁడవై

వర్తిల్లుమని యాదేశించిరి. అట్టియెడ నావృద్ధదంపతులు విశాలాక్షీ విశ్వనాథులై వ్యాసునకుఁ దచ్ఛిష్య వర్గంబునకు దర్శన మనుగ్రహించిరి.

—: వ్యాసుఁడు కాశిని వదలుట :—

పరమేశ్వరుండు పారాశర్యుంగాంచి పూర్వమువలె నీవు కాశియం దుండఁదగవు. అయిదు క్రోసుల కవ్వల నుండుము. పుణ్యదినంబులందు వచ్చి మమ్ము సేవించి పోవుచుండుము. ఎన్నండేని తీర్థములఁ దీర్థవాసుల నిందింపకుము. బుద్ధిమంతుండవై పరవిద్యా తేజంబుల కసహ్యావడక బ్రదుకుమని యంతర్ధానుండయ్యె. శివుని యనుజ్ఞయగుటచే వ్యాసుండు శిష్యగణంబుతోఁ గాశి వీడిచనియె. విశాలాక్షి యెప్పటియట్లఁ దల్లిదండ్రుల కనుంగుబిడ్డయై పరమశివునకుఁ బ్రియపత్నియై లోకంబుల కెల్ల నన్నదాత్రియై వర్తిల్లె.

ఈకథ శ్రద్ధాభక్తులతోఁ జదివినవారు విన్నవారు విశ్వేశ్వరానుగ్రహపాత్రులై చిరకాల సుఖభాగులై వర్తిల్లుదురు.

తే॥ అదనునకు వానయిచ్చుఁగా ♦ కంబుదములు
పృథివి పాఁడిపంటలతోడ ♦ వెలయుఁగాక
శాంతియుతమగుఁగాక దే ♦ శమ్ము సతము
భయములేక యుందురుగాక ♦ ప్రజలు మదిని.

స్వస్తిరస్తు.